JUNIOR

# QUEST



## NOW with the added fun of SPUTNIK Junior!




Selections from Sputnik Junior!.

* Colourfully illustrated stories and cartoons.
* Superb science fiction
* Entertainment and general knowledge

64 packed pages!
At just Rs. 6/-

To subscribe write to,
JUNIOR QUEST,
Dolton Agencies,
Chandamama Buildings,
N.S.K. Salai, Vadapalani,
Madras: 600 026.



A Chandamama
Vijaya Combines
publication

# Don't you owe the

















# ittle one a cuddles?













**CUDDLES**

CHANDAMAMA TOYTRONIX

'మేరీ' గోల్డు కవరింగ్ జ్యాయలరీ ఫ్యాషన్స్‌లో అందెవేసిన చేయి. ప్రపంచంలోని స్త్రీలందరూ నాణ్యతకు - మన్నికకు వాడవలసినవి - ధరించవలసినవి - అలంకరించ వలసినవి. కంటికింపగు ఈ ఆభరణముల కొరకు నేడే మీ ఆర్డరును పంపించండి. వి.పి.పి. ద్వారా ఆభరణములను పొందండి డిజైను నంబర్లను మరియు ఉచితమైన కేటలాగులను ప్రత్యేకముగా అడుగుట మరిచిపోవద్దు.


No:676 Rs.200/50


No:651 Rs.100/50


No:347 Rs.150/50



No:630 Rs.100/50



No:611 Rs.100/50



No:397 Rs.100/50



No:337 Rs.200/50



No:391 Rs.150/50



No:435 Rs.200/50



No:745 Rs.175/50




No:690 Rs.100/50

Rs.100/50 No:396




No:472 Rs.375/50


No:771 Rs.150/50


No:533 Rs.275/50

No:542 Rs.275/50


No:442 Rs.200/50

No:303 Rs.100/50



No:306 Rs.100/50





No:703 Rs.150/50


No:691 Rs.100/50


No:556 Rs.300/50

No:438 Rs.200/50




No:696 Rs.100/50

No:317 Rs.100/50



No:632 Rs.100/50




No:383 Rs.300/50


No:547 Rs.250/50


No:694 Rs.100/50


No:812 Rs.200/50

No:729 Rs.200/50



No:742 Rs.150/50



# MERI GOLD COVERING WORKS

P.O.BOX 1405, 14, RANGANATHAN STREET

T.NAGAR, MADRAS - 600 017, PHONE: 444671




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' 　　　　 సంచాలకుడు : నాగిరెడ్డి

## నూతన ప్రపంచ వ్యవస్థ!

కొత్తసంవత్సరంలో అడుగుపెడుతూన్న ఈ తరుణంలో, ఇటీవల కొందరు నాయకులు ప్రస్తావిస్తూన్న, 'నూతన ప్రపంచ వ్యవస్థ' అన్న విషయం గురించి పరిశీలిద్దాం.

అమెరికా అధ్యక్షుడు జార్జ్‌బుష్, గల్ఫ్‌యుద్ధానంతరం—త్వరలో 'నూతన ప్రపంచ వ్యవస్థ' రూపొందనున్నది. అని మొట్టమొదట అన్నారు. ప్రపంచ రాజకీయాలలో వస్తూన్న మార్పుల దృష్ట్యా ఆయన అలా అని వుండవచ్చు.

గత సంవత్సరం ప్రపంచ వ్యాప్తంగా కొన్ని ముఖ్యమైన మార్పులు జరిగాయి. సోవియట్ యూనియన్, యుగోస్లావియా లోని రాష్ట్రాలు కొన్ని ప్రత్యేక దేశాలుగా విడిపోయి, చిన్నచిన్న దేశాలు సైతం సర్వతంత్ర స్వతంత్ర దేశాలుగా రూపొందాయి. ఆయుధ సేకరణను తగ్గించడానికి అగ్రరాజ్యాలు తీసుకున్న నిర్ణయాలూ, ఆగ్నేయాసియాలోనూ, పశ్చిమ ఆసియా దేశాలలోనూ నెలకొంటూన్న శాంతిపరిస్థితులు మున్ముందు పరిణామాలు ఆరోగ్యకరమైన నూతన ప్రపంచ వ్యవస్థకు దోహదం చేయగలవని ఆశించవచ్చు.

చైనా ప్రధాని లీపెంగ్—సభ్యదేశాలమధ్య పరస్పర చర్చలద్వారా, అంతర్జాతీయ వ్యవహారాలను సరిదిద్దుకోవాలి: నెహ్రూ, నాసర్, టిటో ప్రతిపాదించిన పంచశీల సిద్ధాంతాలు, నూతన ప్రపంచ వ్యవస్థకు పునాదులు కావాలి, అని తన ఆకాంక్షను వ్యక్తం చేశారు.

మన దేశానికి చెందిన ప్రముఖ దౌత్యవేత్త డా॥ ఇందు ప్రకాష్ సింగ్, ఈ విషయాన్ని మరింత స్పష్టంగా నిర్వచించారు. "అబ్రహాం లింకన్ రాజనీతి, లెనిన్ సూహాశయుడి ఆర్థిక సూత్రాలూ, మహాత్మాగాంధి నైతిక విలువలూ కలగలిసిన సహకార జీవనంలోనే ప్రపంచ మానవజాతి మనుగడ ఇమిడి ఉన్నది!" అని ఆయన అభిప్రాయపడుతున్నారు.

ఇవన్నీ సునిశితంగా ఆలోచించవలసిన విషయాలు!

'చందమామ' పాఠకులకు నూతన సంవత్సర శుభాకాంక్షలు తెలియజేస్తున్నాము!

సంపుటి 90 　　　　 జనవరి '92 　　　　 సంచిక 1

విడి ప్రతి : 4-00 　　　　 సంవత్సర చందా : 48-00






**1975**
వనితల స్థితిగతులు
మెరుగుపరచడానికై....

* అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో ఉదయించిన
ఏకైక స్త్రీజన పత్రిక ఏది?

## వనిత

* దశాబ్దంన్నరగా స్త్రీలకు ఉపయుక్తమైన అనేక
అంశాలను ప్రస్తావిస్తున్న ఏకైక మాస పత్రిక ఏది?

## వనిత

* మరి నెలతల ప్రియనెచ్చెలి ఏది?
నిస్సందేహంగా

## వనిత

**1992**
వనితలను అభ్యుదయపథంలో
నడిపించడంలో పదిహేడవ
సంవత్సరం....




కారణం
• విజ్ఞానానికి • వికాసానికి • వినోదానికి

# వనిత

చందా వివరాలకు:
విజయా బుక్ హౌస్,
చందమామ బిల్డింగ్స్,
వడపళని, మద్రాసు - 600 026

వార్తలు-విశేషాలు:

# హెల్మట్ కోల్‌కు నెహ్రూ అవార్డు

నలభైనాలుగు సంవత్సరాల క్రితం, స్వాతంత్ర్య సముపార్జన కోసం, విభజనకు గురైనది మన దేశం. నలభైఆరు సంవత్సరాలకు పూర్వం విడిపోయిన రెండు దేశాలను ఒకటిగా కలపడానికి కృషి చేసిన నాయకుణ్ణి ఇవాళ మన దేశం గౌరవిస్తున్నది. అంతర్జాతీయ అవగాహనను పెంపొందించడానికి ఏర్పరచిన నెహ్రూ అవార్డును (1990) శాంతియుతంగా, ప్రజాస్వామ్యబద్ధంగా ఉభయ జర్మనీలు ఒకటిగా విలీనం కావడానికి కృషి చేసిన డా॥ హెల్మట్ కోల్‌కు ఇచ్చి సత్కరిస్తున్నది.

నెహ్రూ జన్మదినమైన నవంబర్ 14న ఈ పురస్కారాన్ని ప్రకటించారు. 1989 వసం॥ నెహ్రూ అవార్డు—దక్షిణాఫ్రికాలోని జాతి వివక్షతను రూపుమాపడానికి కృషి చేస్తూన్న జింబాబ్వే అధ్యక్షుడు డా॥ రాబర్ట్ ముగాబేకు లభించింది.

అఖరి చక్రవర్తి అయిన రెండవ కైజర్ విల్‌హెల్మ్ కాలంలోనూ, ఆ తరవాత అడాల్ఫ్ హిట్లర్ నియంతృత్వపాలనలోనూ జర్మనీ ఒకటిగానే ఉండేది. 1939 వ సం॥ సెప్టెంబర్‌లో నాజీ జర్మనీ పోలండ్ మీద దురాక్రమణ జరపడంతో, రెండవ ప్రపంచ యుద్ధం (1939 — 1945) ప్రారంభమయింది. యుద్ధంలో జర్మనీ పరాజయం పాలవడంతో, హిట్లర్ ఆత్మహత్య చేసుకున్నాడు.

జర్మనీ లొంగిపోయిన తరవాత, అది నాలుగు ప్రాంతాలుగా విభజించబడి అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్, సోవియట్ సేనల అధీనంలోకి వచ్చింది. 1949 వ సం॥లో తూర్పు ప్రాంతం 'జర్మన్ డెమొక్రటిక్ రిపబ్లిక్' అన్న పేరుతో స్వతంత్ర దేశమయింది. దీనినే తూర్పు జర్మనీ అంటారు. తూర్పు బెర్లిన్ దీని రాజధాని. ఆ సంవత్సరంలోనే 'ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీ' అన్న పేరుతో పశ్చిమ జర్మనీ కూడా ఏర్పడింది. కాని 1954 వ సం॥లో అది సర్వతంత్ర స్వతంత్ర రాజ్యంగా రూపొందింది. బాన్ దాని రాజధాని.

1953 వ సం॥లో తూర్పు జర్మనీలో చెలరేగిన అల్లర్లను సోవియట్ సేనలు

అణచివేశాయి. ఆ తరవాత తూర్పుజర్మనీ ప్రజలు పశ్చిమ జర్మనీకి తప్పించుకుని పారిపోకుండా 'బెర్లిన్ గోడ' నిర్మాణం కూడా జరిగింది.

1973 వ సం॥లో ఉభయ జర్మనీల మధ్య సత్సంబంధాలు ఏర్పడ్డాయి. 1976 వ సం॥లో కమ్యూనిస్టునాయకుడు ఎరిక్ హెూనేకర్ తూర్పు జర్మనీ అధ్యక్షుడయ్యాడు. ఆయన సోవియట్ యూనియన్ సహచరుడుగా వుంటూనే, ఉభయ జర్మనీల మధ్య స్నేహ సంబంధాలను పెంపొందించాలని, 1987 వ సం॥లో మొట్ట మొదటిసారిగా పశ్చిమ జర్మనీని సందర్శించాడు. అప్పుడు డా॥ హెల్మట్ కోల్ పశ్చిమ జర్మనీ ఛాన్స్లర్ గా వుండేవాడు.






1990 వ సం॥ ఏప్రిల్ నెలలో జరిగిన 12 దేశాల 'యూరోపియన్ కౌన్సిల్' సమావేశం—ఉభయ జర్మనీల శాంతియుత విలీనం కోసం డా॥ కోల్ చేస్తున్న కృషిని ప్రోత్సహించింది. అనాటినుంచి డా॥కోల్ యూరప్ దేశాల వ్యవహారాలలో ప్రముఖ పాత్ర వహించసాగాడు. 1990 అక్టోబర్ 3 వ తేదీ ఉభయ జర్మనీలు విలీనమయ్యాయి. ఆనందోత్సాహాలతో ప్రజలు బెర్లిన్ గోడను పడగొట్టారు. ఇవాళ 8 కోట్ల జనాభాతో, సంయుక్త ఆర్థిక విధానంతో, సమైక్యజర్మనీ ప్రపంచంలో గొప్ప శక్తిగా రూపొందే అవకాశం ఉన్నది.

1990వ సం॥ జరిగిన ఎన్నికలలో డా॥ కోల్ జర్మనీ ఛాన్స్లర్‌గా ఎన్నికయ్యారు. ఆయన ఒక ఇష్టాగోష్ఠిలో -ఘర్షణారహితమైన ప్రపంచ వ్యవస్థ రూపొందానికి మహాత్మాగాంధీ, జవహర్‌లాల్ నెహ్రూ వెలిబుచ్చిన అభిప్రాయాలు తనకెంతో స్ఫూర్తినిచ్చినట్టు చెప్పారు.

సమైక్య జర్మనీ ఆవిర్భావం ఐరోపా ఖండ చరిత్రలో నూతన శకానికి నాంది పలికిందని, నెహ్రూ అవార్డ్ కమిటీ ప్రశంసించింది.



# పండితుడి జీవనోపాధి

విమలపురి రాజైన వివేకవర్మకు సాహిత్యమంటే తగనిమక్కువ. పాండిత్యమన్నది, సరస్వతీకటాక్షం వుంటేతప్ప లభించని గొప్పవరమని, ఆయన విశ్వాసం. అ కారణంగా, ఆయన తనను దర్శించ వచ్చిన కవులనూ, పండితులనూ ఎంతగానో ఆదరించేవాడు. శ్రీముఖుడనే కవి, వివేకవర్మ ఆస్థాన ప్రధానపండితుడు. మంత్రి అయిన ధీనిధికి పండితులంటే సదభిప్రాయం లేదు. ధనంతో పోలిస్తే, పాండిత్యం ఎందుకూ కొరగాదని అతడు భావించేవాడు.

ఒకసారి మాటల సందర్భంలో రాజు వివేకవర్మ, ధీనిధితో, ''మహామంత్రీ! శ్రీముఖుడి పాండిత్య ప్రతిభావిశేషాలు చూసినప్పుడు, నాకున్న సిరిసంపదలు, వాటిముందు గుడ్డిగవ్వకు సరిపోలవని పిస్తుంది,'' అన్నాడు.

అందుకు ధీనిధి నవ్వి, ''మహారాజా! మన్నించండి, నేను తమ అభిప్రాయంతో ఏకీభవించలేను. ధనంతో పోలిస్తే, పాండిత్యం ఎందుకూ పనికిరాదు. పాండిత్యం లేకుండా జీవించవచ్చుగాని, ధనం లేకుండా జీవించడం సాధ్యం కాదు. ఆ శ్రీముఖుడు, మీరు జీవనోపాధి కల్పించకపోతే, ఎంత పండితుడయ్యా ఏం లాభం?'' అన్నాడు.

వివేకవర్మకు, మంత్రి మాటలు రుచించలేదు. ఆయన మంత్రితో, ''మీరు సాహిత్యం గురించిన సరైన అవగాహన లేక, అలా మాట్లాడుతున్నారు!'' అన్నాడు.

దానికి ధీనిధి, ''మహారాజా! నాకు సాహిత్యంతో, ఇతర కళలతో పరిచయం లేకపోవచ్చు. కాని, వాస్తవ జీవితాన్ని గురించిన అనుభవం తమకు కలిగితే

వక్కలంక 'కిషోర'



తప్పు, నా మాటల్లోని యథార్థం తమరు గ్రహించలేరు,'' అన్నాడు.

ఇలా వుండగా—ఒకసారి రాజు వివేకవర్మ, ధీనిధి విమలపురిలోని ఒక గురుకులాన్ని సందర్శించడానికి వెళ్ళారు. ఆ గురుకులాన్ని మాధవానందుడనే ఆయన నడుపుతున్నాడు. రాజ్యంలోని మరే ఇతర గురుకులాల్లోని విద్యార్థులకన్నా, మాధవానందుడి గురుకులంలోని విద్యార్థులు ఎక్కువ ప్రతిభాపాటవాలు చూపుతున్నారు!

వివేకవర్మ, మాధవానందుణ్ణి కలుసుకుని, ''ఆర్యా! మీ గురుకులంలో విద్యనభ్యసించిన విద్యార్థులు, మిగతావారికన్న ఎక్కువ ప్రజ్ఞ చూపుతున్నారు. 'ఇందుకు కారణం ఏమిటో చెబితే వినాలనుకుంటున్నాను,'' అన్నాడు.

మాధవానందుడు చిన్నగా నవ్వి, ''మహారాజా! ఇక్కడ గురుకులంలో నేను బోధించాల్సినదంతా బోధించాక, ప్రతి విద్యార్థికీ ఆస్థానపండితుడు శ్రీముఖుడు రచించిన కావ్యాన్నొకదాన్ని ఇస్తాను. ఆ కావ్యంలో తప్పు పట్టగలిగితే, అప్పుడే అతడికి యోగ్యతాపత్రం ఇవ్వడం జరుగుతుంది,'' అన్నాడు.

ఇది విని వివేకవర్మ కోపంగా, ''అయితే, మా ఆస్థానపండితుడి కావ్యాల్లో తప్పులెంచడం, మీ విద్యార్థులు విధిగా చేయవలసిన పని అన్నమాట! ఇది మా ఆస్థానానికి తీరని అవమానం,'' అన్నాడు.

మాధవానందుడు వినయంగా, ''మహారాజా! మహాకవి శ్రీముఖుడి కావ్యాల్లో తప్పు చెప్పగలగడమంటే, సామాన్య విషయం కాదు. దానికి ఎంతో పాండిత్యం కావాలి. మా విద్యార్థుల మేధాశక్తికి ప్రమాణంగా, మీ ఆస్థానపండితుణ్ణి తీసుకున్నామంటే, అది మీకు గర్వకారణమే గాని, అవమానం ఎంతమాత్రమూ కాదు,'' అన్నాడు.

ఈ మాటలతో వివేకవర్మ శాంతించి, ''సరే! ఈనాటివరకూ మీ

గురుకులం నుంచి, ఎందరు విద్యార్థులు యోగ్యతాపత్రాలు తీసుకున్నారు ?'' అని ప్రశ్నించాడు.

''ఏమని చెప్పేది, మహారాజా ! కిందటి సంవత్సరం వరకూ, ఏడాదికి ఒకరిద్దరి కంటే ఉత్తీర్ణులయ్యేవారు కాదు. కాని, ఈ ఏడాది పదిహేనుమందిదాకా యోగ్యతా పత్రానికి అర్హులయ్యారు. అయితే, అలా అర్హులైనవారిలో చాలామంది సామాన్యమైన తెలివితేటలు గల వాళ్ళు కావడం, నాకు ఆశ్చర్యం కలిగిస్తున్నది.'' అన్నాడు మాధవానందుడు.

''మహాకవి శ్రీముఖుడి కావ్యాలలో తప్పులు పట్టగలవాళ్ళు, సామాన్యమైన తెలివిగలవాళ్ళని మీరనడం, వింతగా వున్నది!'' అన్నాడు రాజు వివేకవర్మ ఆశ్చర్యంగా.

అప్పటివరకూ మౌనంగా వున్న మంత్రి ధీనిధి కల్పించుకుని, ''ఇందులో వింత ఏమీలేదు, మహారాజా ! మాధవానందుల గురుకులం నుంచి వచ్చినవారికి, మీరు ఆస్థానంలో ఎక్కువ ప్రాముఖ్యతనిస్తున్నారు. అందువల్ల, వేరే ఎవరైనా మహాపండితుడు, శ్రీముఖుడి కావ్యాలలోని లోపాలను ఎంచి సిద్ధంగా వుంచుకుని, ఈ గురుకులంలో విద్య పూర్తిచేసినవారికి, వాటిని ఎంతో కొంత ధరకు అమ్ముతూండవచ్చు గదా !'' అన్నాడు.

మంత్రి లౌకిక బుద్ధికి వివేకవర్మ ఆశ్చర్యపోయాడు.





వారం రోజుల తర్వాత, వివేకవర్మ చారులను పంపి విచారించగా, మంత్రి మాటల్లో నిజమున్నదని తెలిసింది. రాజధానికి దాపులనున్న రామాపురం అనే గ్రామంలో విష్ణుశర్మ అనే పండితుడొకాయన వున్నాడు. ఆయన శ్రీముఖుడి కావ్యాలలోని తప్పులను ఎంచి, మాధవానందుడి గురుకులం నుంచి వచ్చినవారికి వాటిని చెప్పి, ఎంతో కొంత ధనం వసూలు చేస్తున్నాడు.

రాజు వివేకవర్మ, విష్ణుశర్మను చూడబోయి, "పండితోత్తమా! మీరు చేయవలసిన పనేనా ఇది? మీ కారణంగా ప్రతిభ లేని విద్యార్థులు పట్టాలందుకుంటున్నారు. మీ పాండిత్యాన్ని ఇలా ఎందుకు దుర్వినియోగం చేస్తున్నారు?" అని అడిగాడు.

విష్ణుశర్మ చేతులు జోడించి, "మహాప్రభూ! ఇన్నాళ్ళకు, ఈ విధంగానైనా మీ దర్శనభాగ్యం లభించింది. గతంలో ఎన్నోసార్లు రాజధానికి వచ్చాను. కాని, నా పాండితీప్రతిభ చూసి, తన స్థానం ఎక్కడ దెబ్బతింటుందోనని, మీ ఆస్థాన పండితులు శ్రీముఖులవారు, నాకు మిమ్మల్ని కలిసే అవకాశం లేకుండా చేశారు. సాక్షాత్తూ మీరు ఆస్థాన పండితుడిగా ఎంపిక చేసిన శ్రీముఖుని కావ్యాలలోనే తప్పు లెన్నగలిగిన నాకు, ఎంతో కొంత ప్రతిభ వున్నదనే అనుకుంటున్నాను. ప్రతిభ లేనివారికి యోగ్యతాపత్రాలు లభిస్తున్నాయని, మీరు బాధపడుతున్నారు; ప్రతిభ కలిగీ భుక్తికి లేక నేను బాధపడుతున్నాను. అందువల్లనే, నా పాండిత్యాన్ని నా చేతనైన రీతిలో సొమ్ము చేసుకుంటున్నాను. ఇందులో నాకు తప్పేమీ కనిపించడం లేదు," అన్నాడు.

రాజు వివేకవర్మ మారుమాట్లాడకుండా, రాజప్రాసాదానికి బయలుదేరాడు. మంత్రి ధీనిధి, ఆయనతో, "మహారాజా! లక్ష్మికోసమై సరస్వతిని అమ్ముకునే పండితులు వున్నప్పుడు, సాహిత్యం కంటే ధనం గొప్పదని నేను భావించాను!" అన్నాడు.

ఆ మాటలకు వివేకవర్మ నవ్వి, "పొర బాటు, మహామంత్రీ! ధనం అనేది జీవనో పాధికి సహకరించేదయితే, సాహిత్యం ఒక కళ. కాబట్టి, రెండిటినీ పోల్చడం అర్థరహితం. ధనార్జనకై పాండిత్యాన్ని అమ్ముకున్నాడని, ఒక పండితుడిపై నేరారోపణ చేసేముందు, అతడికి మనం బతుకుతెరువు కల్పించామా లేదా, అనేది ఆలోచించాలి. విష్ణుశర్మ అలా ప్రవర్తించ డానికి కారణం నేనే తప్ప, అతడి తప్పు అణుమాత్రం కూడా లేదు. అయితే, మీ దురభిప్రాయానికి కారణం, శ్రీముఖుడి వంటి కొందరు స్వార్థపరులు," అన్నాడు.

ఆ తర్వాత రాజు వివేకవర్మ, శ్రీముఖు డిని ఆస్థాన పండిత పదవి నుంచి తొల గించి, ఆ స్థానంలో విష్ణుశర్మను నియ మించి, పండితులెవరైనాసరే తనను సులువుగా కలిసే అవకాశం కల్పించాడు.

ఒకనాడు రాజు వివేకవర్మ, మాటల సందర్భంలో విష్ణుశర్మతో, "పండి తోత్తమా! మీరు ఆస్థానపండితులు గనక, ఇక నుంచి మాధవానందుడి గురుకులంలో ఉత్తీర్ణులైన విద్యార్థులకు యోగ్యతా పత్రా లివ్వడానికి, మీ కావ్యాలనే ప్రామాణికంగా తీసుకోవడం జరుగుతుంది. అంటే— మీ కావ్యాలలో తప్పు లెన్నినవారికే యోగ్యతాపత్రాలిస్తారన్న మాట!" అన్నాడు.

దానికి విష్ణుశర్మ, "వద్దు, ప్రభూ! ఇంతవరకూ నేను చేసిన పనే, రాజ్యం లోని మరొక పండితుడెవరైనా చేసే అవ కాశం వున్నది," అన్నాడు.

దానికి వివేకవర్మ, "ఇప్పుడు రాజ్యం లోని పరిస్థితులు గతంలోలా లేవుకదా! ప్రతిభ గల పండితుడికి నన్ను దర్శించే అవకాశం పూర్తిగా వున్నది. అయితే, ఇకపై మాధవానందుడి గురుకులం నుంచి, ఒక్క విద్యార్థి కూడా యోగ్యతా పత్రాన్ని పొందకూడదన్నదే, నా ఆకాంక్ష!" అన్నాడు నవ్వుతూ.

రాజు మాటల్లోని మర్మాన్ని గ్రహించి మౌనంగా తలూపాడు, విష్ణుశర్మ.



# సాహసి!

చింతపల్లి అనే ఊళ్ళో ఓబలేసు అనేవాడు, ఒక రాత్రంతా భయంకరమైన నట్టడవిలో క్రూర జంతువులమధ్య కాలం గడిపి, తెల్లవారగానే తాపీగా ఇల్లు చేరుకున్నాడు. ఈ సాహసకృత్యం ఊరి జమీందారుకు తెలిసి, అటువంటి సాహసికి తగిన బహుమానం ఇద్దామని, నౌకరును ఓబలేసు ఇంటికి పంపాడు.

ఆ సమయంలో ఓబలేసు ఇంట్లో లేడు. నౌకరు, వాడి భార్య కాసులమ్మకు సంగతి చెప్పాడు.

అది విని కాసులమ్మ రుసరుసలాడుతూ, "ఈ సంగతి జమీందారుగారి వరకూ వెళ్ళిం దన్న మాట! సంపాదించిన కూలి డబ్బులు ఎక్కడో జూదం ఆడి పోగొట్టుకుని, ఇంటికి వచ్చి నాకెదురుపడే ధైర్యం లేక, రాత్రంతా నట్టడివిలో కాలం గడిపాడు. ఈ రోజు కూలిడబ్బులతో పాటు, నిన్న పోగొట్టిన కూలిడబ్బులు కూడా కలిపి తెచ్చినప్పుడే గడపతొక్కమని, ఇంటి నుంచి తరిమేశాను. ఆ ఇచ్చే బహుమానమేదో, నాకివ్వమని జమీందారుగారికి చెప్పు!" అన్నది.

నౌకరు తిరిగి వచ్చి జమీందారుకు కాసులమ్మ అన్న మాటలు చెప్పాడు. ఆయన చిన్నగా నవ్వుకుని, "అవును, నిజానికి ఓబలేసును అంతటి సాహసవంతుణ్ణి చేసిన, వాడి పెళ్ళానికే బహుమతి చెందుతుంది," అన్నాడు.

—జొన్నలగడ్డ రత్న






**11**

[సదానందముని ఆదేశానుసారం, దుర్మార్గులను ఎదిరించడానికి అపూర్వుడు హిమాలయాల నుంచి రుద్రపురికి వచ్చాడు. రుద్రపురి యువరాణి కృష్ణకుమారి కంఠహారంలోని మహిమగల చంద్రకాంతమణిని కాజేయడానికి, దుష్టమాంత్రికుడు తన బాల్యమిత్రుడయిన ప్రధానమంత్రితో రహస్యాలోచన జరపడం, అపూర్వుడు చాటునుంచి విన్నాడు.—తరవాత]

మాంత్రికుడు ప్రధానమంత్రి భవనం నుంచి, వెలుపలికి వచ్చేసరికి అర్ధరాత్రి అయింది. వాడు నల్లటిదుస్తులు ధరించడంవల్లా, నల్లటిజుట్టూ, పొడవాటి గడ్డం కారణంగా చీకటిలో చీకటిగా నడవసాగాడు.

చంద్రకాంతమణితో మాంత్రికుడు ఎటువంటి పూజలు చేయనున్నాడు? ఆ పూజా విధానాలను వాడు ఎవరినుంచి నేర్చుకున్నాడు? ఎప్పుడు చేస్తాడు? మొదలైన విషయాలను తెలుసుకోవాలన్న ఉత్సాహంతో, అపూర్వుడు మాంత్రికుడికి వెనకగా, కొంతదూరంలో, అడుగుల చప్పుడు వినిపించకుండా నడవసాగాడు. తన వెంట మరొకరు వస్తున్నారన్న విషయం మాంత్రికుడికి తెలియదు.

నగరం పొలిమేర దాటాక, దారిపక్కన వున్న ఒక పొదలోనుంచి, బలమైన ఎలుగు



బంటి ఒకటి వచ్చి, మాంత్రికుడి ముందు వంగింది. మాంత్రికుడు దాని వీపుమీద కూర్చున్న తరవాత, అది అమితవేగంతో అరణ్యంకేసి పరిగెత్త సాగింది. వేగంగా పరిగెత్తడం అపూర్వుడికి కొత్త కాదు గనక, అతడు దాన్ని వెంబడించి పరిగెత్త సాగాడు!

కొంతసేపటికి వాళ్ళు అడవిలోని ఒక చిన్న నదీతీరం సమీపించారు. ఎలుగుబంటి వీపు మీది నుంచి కిందికి దిగిన మాంత్రికుడు దాని చెవులు పట్టుకుని గట్టిగా మెలిపెడుతూ, "మూర్ఖుడా, పరిగెత్తడం కూడా మరిచిపోయినట్టున్నావు. ఛీ ఛీ! వెళ్ళు. బేతాళ వటవృక్షం దగ్గర వుండు. నేను వస్తాను," అని ఆజ్ఞాపించాడు కోపంగా.

ఎలుగుబంటి సరేనన్నట్టు గుర్రుపెట్టి, వెనుదిరిగి వెళ్ళి చీకటిలో కలిసిపోయింది. ఆ మృగం పరిస్థితి చూసి, అపూర్వుడికి జాలి కలిగింది. అతడు కూడా ఒక్కొక్కసారి జంతువులపై ప్రయాణం చేయడం కద్దు. అయినా, అతడు జంతువులను బెదిరించడు, హింసించడు. ప్రేమతో, కృతజ్ఞతగా చూచుకుంటాడు. అందువల్ల జంతువులు కూడా అతనిపట్ల ఎంతో అప్యాయతను కనబరుస్తాయి. అయితే, ఈ మాంత్రికుడు ఎలుగుబంటిని మంత్ర ప్రభావంతో లొంగదీసుకుని, హింసించి దాని చేత ఊడిగం చేయించుకుంటున్నాడు!

మాంత్రికుడు నదిని సమీపించి, ఏదో మంత్రం పఠిస్తూ మూడుసార్లు చప్పట్లు చరిచాడు. కొంతసేపటికి నదిలో దూరంగా నీళ్ళను పైకి చిమ్ముతూ, ఒక పెద్ద మొసలి పైకి లేచి మాంత్రికుడు నిలబడి వున్న ఒడ్డుకేసి ఈదుకుంటూ వచ్చింది. దగ్గరికి రాగానే, మాంత్రికుడు ఎగిరి దాని వీపు మీద కూర్చుని, "ఊఁ, వేగంగా పో!" అని ఆజ్ఞాపించాడు.

మొసలి పడమటి దిశగా ఈదుకుంటూ బాణంలా దూసుకుపోసాగింది. దానిని



అనుసరించి, అపూర్వుడు కూడా ఒడ్డు మీద పరిగెత్తసాగాడు.

ఆకాశంలో రేఖామాత్రంగా నేచంద్రుడు కనిపిస్తున్నాడు. అక్కడక్కడా చుక్కలు మెరుస్తున్నాయి. నదికి రెండు వైపులా పొదలనుంచి, నక్కల ఊళలూ, గుడ్లగూబల అరుపులూ వినిపిస్తున్నాయి. అప్పుడప్పుడు దూరంనుంచి పులి గాండ్రింపు వినిపిస్తున్నది. అయినా, భయం అంటే ఎరుగని అపూర్వుడు, వాటినంతా లెక్కచేయకుండా, మాంత్రికుణ్ణి వెంబడించి పరిగెత్తసాగాడు.

అలా చాలా దూరం వెళ్ళాక, నది రెండు పాయలుగా చీలి, అందులో ఒక పాయ ఇరువైపులా కొండలుగల ఒక ఇరుకైన సొరంగ మార్గంలోకి ప్రవేశించింది. అది చిమ్మచీకటి కమ్ముకున్న సొరంగ మార్గం. మొసలి సొరంగంలోకి సునాయాసంగా ప్రవేశించింది. అంతవరకూ నది ఒడ్డున పరిగెత్తుతూన్న అపూర్వుడు, నీళ్ళలోకి దూకి, మొసలిని అనుసరించి, ఈదుకుంటూ వెళ్ళసాగాడు.

మొసలి ఒక గుహ ముఖద్వారం దగ్గరికి వెళ్ళి ఆగింది. వెంటనే మాంత్రికుడు దాని వీపు మీది నుంచి ఒక్క గెంతులో దాపులనున్న పెద్ద బండ మీదికి ఎగిరి దూకాడు.

''ఎవరక్కడ?'' అన్న అతి భయంకరమైన కీచు కంఠస్వరం గుహలోపలినుంచి వినిపించింది. అటువంటి వింత కంఠస్వరాన్ని అపూర్వుడు అంతకుముందెన్నడూ వినలేదు. అదొక ముసలిదాని కంఠస్వరమై వుంటుందని అతడు ఊహించాడు.

''నీ భృత్యుడైన వీరవికటుణ్ణి, నేను! లోపలికి రావచ్చా?'' అన్నాడు మాంత్రికుడు.

''నువ్వు సరే, మరి నీ వెంట ఉన్నవాడెవడు?'' అని గద్దించిందా కంఠస్వరం.

''నేనూ, మొసలీ తప్ప మూడో ప్రాణి లేదు, తల్లీ!'' అన్నాడు మాంత్రికుడు.

"మూర్ఖుడా! చుట్టుపక్కల జాగ్రత్తగా చూడు!" అని కోపంగా హెచ్చరించిందా కంఠస్వరం.

గుహలోని మాయదారి ముసలిది— తాను ఇక్కడ వున్న సంగతిని పసిగట్టగల శక్తిగలిగినదని అపూర్వుడు గ్రహించాడు. వెంటనే అతడు గురువు ఉపదేశించిన అదృశ్యకరణి మంత్రాన్ని పఠించి, ఎవరికీ కనిపించకుండా మాయమైపోయాడు!

మాంత్రికుడు సారంగమంతా పరిశీలనగా చూశాడు. కాని వాడి కంటికి ఎవరూ కనిపించలేదు!

"లేదు తల్లీ, లేదు! ఈ పరిసర ప్రాంతాలలో నేనూ, మొసలీ తప్ప మూడో జీవం లేదు!" అన్నాడు మాంత్రికుడు.

"అలాగా! అయితే రా," అని అజ్ఞాపించిందా కంఠస్వరం.

వీరవికటుడు గుహ లోపలికి అడుగు పెట్టాడు.

అపూర్వుడు మెల్లగా మరొక బండ మీదికి ఎక్కి, ముసలిది ఉన్న గుహకేసి, పాచిపట్టి జారుతూన్న బండలమీదుగా జాగ్రత్తగా పాకుతూ వెళ్ళసాగాడు.

మానవకపాలంలో రగులుతూన్న ఒక విధమైన మంట, గుహలో పసుపుపచ్చ కాంతిని కలిగిస్తున్నది. ముసలి మంత్రగత్తె గుహలోని గోడకు అనుకుని కాళ్ళు



బార్లా చాపుకుని కూర్చుని ఉన్నది. ఆమె వయసు ఖచ్చితంగా చెప్పలేముగాని, మూడువందల యేళ్ళు వుండవచ్చు! ఆమె శరీరం అస్థిపంజరంలా ఉన్నది. ఒళ్ళంతా ముడతలు. కాని ప్రకాశవంతంగా ఉన్నది. కళ్ళు కణకణలాడే నిప్పుకణికల్లా అతి భయానకంగా ఉన్నాయి. వేలిగోళ్ళు పాముల్లా వంకీలు తిరిగి ఉన్నాయి.

"ఏమిటి సంగతి? మన ప్రయత్నం ఫలించిందా?" అని అడిగింది ముసలి మంత్రగత్తె.

వీరవికటుడు ముసలి మంత్రగత్తె పాదాలకు సాష్టాంగ నమస్కారం చేసి,



లేచినిలబడి, ''అవును! ఆ మణి ఇప్పుడు యువరాణి కంఠహారంలో ఉన్నది. అది త్వరలో నా చేతికి రాగలదని భావిస్తున్నాను!'' అన్నాడు.

''ఒక్క మణి మాత్రమేనా నీ చేతికి వచ్చేది?'' అని అడిగింది మంత్రగత్తె.

వెంటనే సమాధానం చెప్పలేక వీర వికటుడు మౌనంగా చూడసాగాడు. వాడి వాలకాన్ని చూసి, మంత్రగత్తె గుహ మారుమోగేలా వింతధ్వనితో నవ్వింది.

''నీ ఉద్దేశం నాకు అర్థం కావడం లేదు, తల్లీ! ఆ మణితోపాటు మరేదైనా కావాలని కోరుకుంటున్నావా?'' అని అడిగాడు వీరవికటుడు.

''మరేదో నాకెందుకురా మూర్ఖుడా! నువ్వు గొప్పగా భావించే ఆ చంద్రకాంత మణినైనాసరే నేను కావాలన్నానా?'' అని అడిగింది మంత్రగత్తె.

''లేదు. ఆ మణిని ఎలా సాధించాలో తెలియజేసింది, నువ్వు. అది కూడా నా కోసమే కదా! అందుకు నిర్మలమైన నీ కరుణాస్వభావమే కారణం?'' అన్నాడు వీరవికటుడు వినయంగా.

''అందుక్కారణం కరుణాస్వభావం కాదురా, మూర్ఖుడా! అసలు నాకు కరుణ అంటేనే తెలియదు. పైగా, నిర్మలమైనదేమిటి, నీ శ్రాద్ధం! నాకు ఐశ్వర్యం మీద ఆశలేదు. అధికారం మీద వ్యామోహం లేదు. నువ్వేమో రాజువై పోవాలని తహతహలాడి పోతున్నావు. రాజయ్యే రహస్యం నాకు తెలుసు కాబట్టి నీకు సహాయపడుతున్నాను. నిన్ను నేను మామూలు రాజును కాదు; ఈ ప్రపంచానికే చక్రవర్తిని చేస్తాను,'' అన్నది మంత్రగత్తె.

''నీమేలు ఈ జన్మకు మరిచిపోను!'' అన్నాడు వీరవికటుడు.

''ఒట్టిమాటలు సరిపోవు. నీకు నేను చేస్తూన్న ఈ సహాయానికి తగిన ప్రతిఫలం నాకు దక్కాలి!'' అన్నది ముసలి మంత్రగత్తె.

"నీ కోరిక ఏమిటో సెలవివ్వు!" అన్నాడు వీరవికటుడు.

"నాకున్నదల్లా ఒకే ఒక్క కోరిక. నేను పోగొట్టుకున్న యౌవనాన్ని మళ్ళీ పొందాలి! అందుకోసం ఆ మహిమగల మణితోపాటు యువరాణిని కూడా నువ్వు తీసుకురావాలి. ఆ యువరాణి యౌవనాన్ని నేను నా శరీరంలోకి జుర్రుకుంటాను!" అంటూ మంత్రగత్తె బిగ్గరగా నవ్వింది.

ఆ మాటలు వినగానే అపూర్వుడు సైతం కంపించిపోయాడు!

"ఇంతకుపూర్వం కొంతమంది యువతులను బలి ఇచ్చి, వాళ్ళ యౌవనాన్ని పొందాలని ప్రయత్నించావు కదా! అయినా నువ్వు ఎప్పటిలాగే ఉంటున్నావు గాని, మార్పు రాలేదే!" అని తన అనుమానాన్ని వ్యక్తం చేశాడు వీరవికటుడు.

"అపశకునపు కూతలు కూయకు! అప్పటి నా ప్రయత్నం విఫలమయింది, అంతే! అందువల్ల నా ప్రయత్నాన్ని మానుకోమంటావా, మూర్ఖుడా. ఇప్పుడు నా ప్రయత్నం సఫలం కాగలదన్న గట్టి నమ్మకం నాకున్నది. ఎందుకంటే ఆ తంతుకు కావలసిన యువతికి ఉండవలసిన అర్హతలన్నీ రుద్రపురి యువరాణిలో ఉన్నాయి. రాజకుమారి.లోని యౌవనాన్నంతా నా శరీరంలోకి పీల్చుకుంటాను. హా! హా! అప్పుడు చూడు నా ఆనందాన్ని! మళ్ళీ యౌవనం వస్తే ఎంత హాయిగా వుంటుంది!" నేనెంత అందంగా ఉండగలనో ఊహించగలవా?" అని అడిగింది మంత్రగత్తె మళ్ళీ బిగ్గరగా నవ్వుతూ

"నువ్వు ఇప్పుడు కూడా అందంగానే ఉన్నావు!" అన్నాడు వీరవికటుడు.

"నోర్ముయ్, మూర్ఖుడా! నీ కపట నాటకాలు నా దగ్గర సాగవు. నావల్ల పనులు కావాలని, ఊరక మూర్ఖంగా పొగడ వద్దు. విన్నావా, నేను చెప్పినట్టు చెయ్. లేదా ఈ క్షణమే ఇక్కడి నుంచి వెళ్ళిపో," అని కీచుకంఠంతో అరిచింది ముసలి మంత్రగత్తె. —(ఇంకావుంది)



# రాజుగారి వంటవాడు

సింహకేతుడనే రాజు వద్ద, గంటన్న అనే వంటవాడు వుండేవాడు. వాడు, రాజుగారి కొక్కరికి మాత్రమే వంట చేసేవాడు. అందరూ వాణ్ణి రాజుగారి వంటవాడు అనేవారు.

ఒకసారి రాణీగారి తమ్ముడు, అక్కను చూడవచ్చాడు. ఆమె గంటన్నకు, రాజుగారితో పాటు తన తమ్ముడికి వంట చెయ్యమన్నది. గంటన్న చేయనన్నాడు. రాణి భటులను పిలిచి, గంటన్నను అప్పటికప్పుడు లాక్కుపోయి, సభలో వున్న రాజుగారికి ఫిర్యాదు చేయమన్నది.

రాజు, గంటన్నను రాణిగారి మాటను ఎందుకు ధిక్కరించావని అడిగాడు. దానికి గంటన్న, "ప్రభూ! నేను మీకు మాత్రమే వంటవాణ్ణి! ఈ సంగతి అందరికీ తెలుసు," అన్నాడు.

రాజు గర్వంగా మీసాలు దువ్వుకుని, గంటన్నకు ఒక ముత్యాలహారం బహూకరించి, వాడి ఆత్మాభిమానాన్ని సభలో మరింత తెలియచేయాలన్న ఉద్దేశంతో, "నీకు వంద వరహాలు బహుమతి ఇస్తాను. రాణీగారి తమ్ముడికి వంట చెయ్యి," అన్నాడు.

గంటన్న వెంటనే, "అలాగే, ప్రభూ!" అన్నాడు.

రాజు ఆ జవాబుకు ఆశ్చర్యపోయి, "ఇందాక నాకు తప్ప మరెవ్వరికీ వంట చెయ్యనన్నావు. ఇప్పుడు వంద వరహాలకు ఆశపడా, మరొకరికి చేస్తానంటున్నావు?" అని ప్రశ్నించాడు.

అందుకు గంటన్న, "అదేం లేదు, ప్రభూ! ఇందాక చేయనన్నది, రాజుగారి వంటవాడినన్న ఆత్మాభిమానంతో, ఇప్పుడు చేస్తానంటున్నది, మీ మాట మీది గౌరవంతో. ప్రభువుల మాటను ఒక వంటవాడు తోసి పుచ్చాడన్న అపఖ్యాతి తమరికి రాకూడదు కదా!" అన్నాడు.

సింహకేతుడు, వాడి జవాబుకు చాలా సంతోషించి, ఇస్తానన్న వంద వరహాలకు మరొక వంద కలిపి బహూకరించాడు.

—కె. వెంకటసుబ్బారావు





# నియమభంగం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ సాహసం, ఓర్పు, పట్టుదలా చూస్తూంటే, చేపట్టిన కార్యం సాధించేందుకు, అవసరమైతే జీవితకాలాన్నంతా, ఈ భయంకరమైన శ్మశానంలో గడిపేందుకు సిద్ధపడినట్టు కనబడుతున్నది. అయితే, ఒక ముఖ్యమైన సంగతి: కొందరికి కొన్ని కొన్ని విషయాల్లో, తిరుగులేని దృఢదీక్షా, కఠోరమైన నియమాలూ వుండడం కద్దు. కాని, అలాంటివాళ్ళు కూడా ఒక్కొక్కసారి తెలియకనో లేక ప్రమాదవశాత్తో నియమభంగానికి గురి అవుతారు. అది గుర్తించలేని ఇతరులు దాన్ని దానగుణంగానో, త్యాగబుద్ధిగానో కీర్తిస్తారు. ఇందుకు

## బేతాళ కథలు



ఉదాహరణగా ఒక శ్రీమంతుడూ, ఆయన మిత్రుడైన రాజూ కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

స్వర్ణదీప్తికా రాజ్యంలో, శ్రీచంద్రుడనే కోట్లకు పడగలెత్తిన శ్రీమంతుడుండేవాడు. ఆయన చాలా ఉదార స్వభావుడు. రాజు జయద్రధుడికి, శ్రీచంద్రుడు మంచి మిత్రుడు. బొక్కసంలో ధనం చాలినంత లేనప్పుడు, రాజు, ఆయనవద్దనుంచి ధనం అప్పు తీసుకుని, పన్నులు వసూలైన తర్వాత వడ్డీతో సహా అప్పు తీర్చేవాడు. ఆ వడ్డీ డబ్బును శ్రీచంద్రుడు పేదసాదలకు దానధర్మాలు చేసేవాడు.

శ్రీచంద్రుడు చిత్రకళలో అందెవేసిన చేయి. ఆయనకు ఇతర కళలపట్ల కూడా ఎంతో అభిమానం వుండేది. ప్రాచీన కాలానికి చెందిన అందమైన శిల్పాలనూ, చిత్రపటాలనూ—ఇంకా ఆభరణాలూ, ఖడ్గాలూ మొదలైనవాటిని, ఎంత డబ్బుకైనా కొనుగోలు చేసేవాడు.

రాజు జయద్రధుడికి, ఒకేఒక విషయంలో మాత్రం శ్రీచంద్రుడి వైఖరి నచ్చేది కాదు. అదేమంటే—రాజు, శ్రీచంద్రుడు సేకరించినపురాతన వస్తువులలో దేనిమీదనైనా ముచ్చటపడినా, దానిని ఇవ్వడానికి శ్రీచంద్రుడు ఇష్టపడేవాడుకాదు.

ఒకనాడు శ్రీచంద్రుడి దగ్గిరకు, శివదత్తుడనే యువకుడు వచ్చాడు. చిరిగినబట్టలు, మాసిన గడ్డంతో వున్నా, అతడి ముఖంలో రాజసం ఉట్టిపడుతుండడం గమనించిన శ్రీచంద్రుడు, అతను కూర్చోవడానికి ఆసనం చూపించాడు.

అందుకు శివదత్తుడు, "అయ్యా! నా వేషం చూసి చాలామంది, నాతో మాట్లాడ్డానికే చీదరించుకున్నారు. మీరు మాత్రం మర్యాద చేస్తున్నారు. నా పేరు శివదత్తుడు. మాది ఒకప్పుడు జమీందారీ కుటుంబం. పురాతన వస్తువుల సేకరణ, మీ అభిరుచి అని విన్నాను. నా దగ్గిర ఈ చిత్రపటం వున్నది. దీన్ని పరిశీలించి ధర

కట్టండి.'' అని ఒక తైలవర్ణ చిత్రం అందించాడు.

చిత్రంవైపు దృష్టి సారించిన శ్రీచంద్రుడు క్షణకాలం నిశ్చేష్టుడయ్యాడు. ఆ తైలవర్ణచిత్రంలో ఒక తల్లి, బిడ్డను ఎత్తుకొని ముద్దాడుతున్నది. ఆ బాలుడు బోసినవ్వులు కురిపిస్తున్నాడు. ఆదృశ్యాన్ని చిత్రకారుడు చిత్రించిన తీరు అత్యద్భుతంగా వున్నది.

ఆయన శివదత్తుణ్ణి, "నా అంచనా తప్పకపోతే, ఇది ఊహాచిత్రం కాదు, సజీవ మూర్తులచిత్రం! అవునా?" అని అడిగాడు.

''మీ ఊహ సరైనదే! ఈ చిత్రంలోని మాతృ మూర్తి, నా తల్లి. ఆ పసిబిడ్డను నేనే! ఆ రోజుల్లో ఈ చిత్రాన్ని గీసిన చిత్రకారుడి ప్రతిభను మెచ్చి, మా తండ్రి అతడికి, నూరు ఎకరాలు మాన్యంగా ఇచ్చాడు. అటువంటిది ఓడలు, బళ్ళయి, నేనీచిత్రాన్ని అమ్మవలసి వచ్చింది.'' అంటూ శివదత్తుడు విచారపడ్డాడు.

''విచారపడకు. ఈ చిత్రాన్ని నేను ప్రాణప్రదంగా చూసుకుంటాను, ఇక దీని ఖరీదు కట్టమంటావా? అది అసాధ్యం. నిన్ను నా ధనాగారానికి తీసుకుపోతాను. నీకెంత ధనం కావాలో అంత తీసుకో,'' అని శ్రీచంద్రుడు, శివదత్తుణ్ణి తన ధనాగారానికి తీసుకుపోయాడు.



శివదత్తుడు, శ్రీచంద్రుడి ధనాగారం నుంచి వంద వరహాలు తీసుకొని, ''నాకీ సొమ్ము చాలు. దీన్ని పెట్టుబడిగా పెట్టి, ఏదైనా వ్యాపారం చేస్తాను. ఆపైన దైవమున్నాడు,'' అన్నాడు.

శ్రీచంద్రుడు ఆశ్చర్యపోయి, ''అంత అద్భుతమైన చిత్రానికి, ఇంత కొద్ది సొమ్ముతో సంతృప్తిపడతావేం? కనీసం లక్ష వరహాలైనా తీసుకో,'' అన్నాడు.

ఇందుకు శివదత్తుడు ఒప్పుకోక, అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

శ్రీచంద్రుడు తాను కొన్న వర్ణచిత్రాన్ని రాజు జయద్రథుడికి చూపించాడు. ఆ చిత్రం రాజును ముగ్ధుణ్ణి చేసింది. ఆయన



శ్రీచంద్రుడితో, ''దీన్ని కొంతకాలం, నా అంతఃపురంలో వుంచుకుని తిరిగి నీకిస్తాను, కాదనకు!'' అన్నాడు.

దానికి శ్రీచంద్రుడు, ''మహారాజా, మీరెరగనిదేమున్నది! నేను సేకరించిన పురాతన వస్తువులలో ఏ ఒక్కటి కూడా, నా మందిరందాటి పోకూడదన్నది, నా నియమం, క్షమించండి!'' అన్నాడు.

కొన్ని సంవత్సరాలు గడిచిన తర్వాత, ఒకనాడు శ్రీచంద్రుడు, రాజు జయద్రధుడితో మాట్లాడుతూండగా, శివదత్తుడు అక్కడికి వచ్చాడు. శ్రీచంద్రుడు అతణ్ణి ఆప్యాయంగా పలకరించి, రాజుకు పరిచయం చేసి, ''ఎలా వున్నావు?'' అని అడిగాడు.

''అయ్యా, మీదగ్గిర పుచ్చుకున్న వంద వరహాలు పెట్టుబడిగా పెట్టి చేసిన వ్యాపారం మూడు పువ్వులూ, ఆరు కాయలుగా వర్ధిల్లింది. లక్షలు గడించాను. ఇప్పుడు మీ సహాయం కోరి వచ్చాను,'' అన్నాడు శివదత్తుడు.

''ఏమిటా సహాయం?'' అని అడిగాడు శ్రీచంద్రుడు.

అందుకు శివదత్తుడు వినయంగా, ''మా తల్లిగారి చిత్రపటం మీకు అమ్మినప్పటినుంచీ, నాకు మనశ్శాంతి లేకుండా పోయింది. దయచేసి, ఆ చిత్రపటాన్ని నాకు ఇచ్చేయండి. అందుకు ప్రతిఫలంగా మీరెంత సొమ్ము కావాలంటే అంత ఇవ్వగలను,'' అన్నాడు.

ఇది విన్న శ్రీచంద్రుడు ఇరుకున పడ్డాడు. తను ఒకసారి కొన్నదాన్ని తిరిగి ఇవ్వడమనేది, తన నియమానికి విరుద్ధం. ఆ విషయం రాజుకే సూటిగా చెప్పేశాడు. ఇప్పుడు వర్ణచిత్రాన్ని శివదత్తుడికి ఇచ్చివేస్తే, రాజుకు తప్పకుండా కోపంవస్తుంది!

శ్రీచంద్రుడు ఇలా ఆలోచిస్తూండగా, రాజు తానడిగితే కాదన్న శ్రీచంద్రుడు, ఇప్పుడా వర్ణచిత్రం విషయంలో ఏం చేస్తాడా అని ఆసక్తిగా చూడసాగాడు.

అది గమనించిన శ్రీచంద్రుడు, శివదత్తుడితో, ''నేను ఒకసారి కొన్న



వస్తువును, ఎట్టి పరిస్థితులలోనూ తిరిగి ఇవ్వను, అది నా నియమం!'' అన్నాడు.

ఆ జవాబుకు శివదత్తుడు నిరాశచెంది, ''అయ్యా, ప్రతి నియమానికీ మినహాయింపు వుంటుంది. మీ నియమాన్ని ఈ ఒక్కసారికీ భంగంచేయండి. నా మాతృమూర్తి సందర్శనాభాగ్యం, నాకు కలిగించండి,'' అని ప్రాథేయపడ్డాడు.

ఈ మాటలు శ్రీచంద్రుడి మనసును నొప్పించినై, అతడు కొద్దిసేపు ఆలోచించి, ''సరే, శివదత్తా! నీకు తల్లి మీద వున్న ప్రేమను గమనించి, ఒక్క అవకాశం మాత్రం ఇస్తున్నాను. నీ దగ్గిర కొన్న చిత్రం లాటిదే, నేనొకటి తయారు చేస్తాను. ఆ రెండింటిలో అసలేదో, దాని అనుకరణ ఏదో నువ్వు గుర్తుపట్టగలిగితే, నీకా చిత్రపటం ఇస్తాను. పరీక్షకు మహారాజుగారే న్యాయనిర్ణేతలుగా వుంటారు,'' అన్నాడు.

ఇందుకు శివదత్తుడు సమ్మతించాడు. శ్రీచంద్రుడు, అతణ్ణి పక్షం రోజుల తర్వాత రమ్మన్నాడు. ఈపక్షంరోజుల్లో శ్రీచంద్రుడు ఎంతో శ్రమించి, శివదత్తుడు యిచ్చిన చిత్రాన్ని పోలిన చిత్రం తయారుచేశాడు.

గడువు రోజున తిరిగివచ్చిన శివదత్తుడికి, రాజు జయద్రథుడి సమక్షంలో, శ్రీచంద్రుడు రెండు వర్ణ చిత్రాలనూ చూపించాడు. కొద్ది క్షణాలపాటు రెండు చిత్రాలనూ పరిశీలించిన శివదత్తుడు, వాటిల్లో అసలు చిత్రమేదో చూపించాడు.

శ్రీచంద్రుడు దానికేసి చూసి, ''శివదత్తా, నువ్వు గెలిచావు! నీ చిత్రపటాన్ని తీసుకుపో,'' అన్నాడు.

రాజు చిత్రపటాలకేసి కొంచెంసేపు పరీక్షగా చూసి, శివదత్తుడితో, ''రెండు చిత్రాలూ ఏమాత్రం తేడాలేకుండా ఒకేలా వున్నాయి. అసలు చిత్రాన్ని నువ్వేలా గుర్తించగలిగావు?'' అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నకు శివదత్తుడు, ''మహారాజా! శ్రీచంద్రుడు గొప్ప చిత్రకారుడు. అయనెంత సూక్ష్మ పరిశీలకుడంటే, మా అమ్మగారి ఎడమ చెవికింద వున్న అతి చిన్న



పుట్టుమచ్చను సైతం గమనించి రూపు దిద్దాడు. అయితే, అసలు చిత్రంలో మా అమ్మగారి ముక్కుపుడకరాయి నీలపు రంగులో వుంటుంది. కాని, శ్రీచంద్రుడు రూపుదిద్దినచిత్రంలో ఎరుపురంగువున్నది. ఆ చిన్న తేడావలన నేను అసలు చిత్రాన్ని గుర్తుపట్టగలిగాను. శ్రీచంద్రుడు వంటి గొప్ప చిత్రకారుడు, ఇలాంటి పొరపాటు ఎలా చేశాడో అర్థం కావడం లేదు!'' అని శ్రీచంద్రుడికి కృతజ్ఞతలు చెప్పి, చిత్ర పటం తీసుకుని వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత రాజు జయద్రథుడు, శ్రీచంద్రుడితో, ''శ్రీచంద్రా! నువ్వు రూపు దిద్దిన చిత్రపటంలో పొరపాటు ఎలా జరిగిందో, శివదత్తుడు గ్రహించలేకపోయినా, నేనుగ్రహించాను. నీలో దానగుణంవున్నదే కాని, త్యాగగుణం లేదని బాధపడేవాడిని. ఇప్పుడా అసంతృప్తి తొలగిపోయింది!'' అంటూ తన మెడలోని విలువైన హారాన్ని తీసి శ్రీచంద్రుడి మెడలో వేశాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, జరిగినదాన్ని బట్టి చూస్తూంటే, శ్రీచంద్రుడికి తాను కొన్న వర్ణచిత్రాన్ని తిరిగి ఇవ్వడం ఏమాత్రం ఇష్టం లేదని తెలుస్తూనే వున్నది. ఒకసారి కొన్నదాన్ని ఏ పరిస్థితులలోనూ తిరిగి ఇవ్వకూడదనేది, శ్రీచంద్రుడి కఠోరమైన నియమం గదా! ఆ నియమం భంగపడరాదనే పట్టుదల కారణంగానే, శివదత్తుడు ఎంతో ప్రాధేయపడిన మీదట, శ్రీచంద్రుడు జాలి తలచినట్టు నటించి, అతడికొక పరీక్ష పెట్టాడు. తను గొప్ప చిత్రకారుడు గనక, ఈ పరీక్షలో శివదత్తుడు ఓడిపోతాడనీ, తనకు నియమభంగం కలగదనీ అతడి నమ్మకం. అయితే, మూల చిత్రాన్ని అనుకరిస్తూ, అతడు మరొక చిత్రాన్ని గీస్తున్నప్పుడు, ముక్కుపుడక రాయి రంగు విషయంలో జరిగిన పొరబాటు కారణంగా, శివదత్తుడు అసలు చిత్రాన్ని గుర్తించగలిగాడు. జరిగింది ఇది కాగా, రాజు జయద్రథుడు,

శ్రీచంద్రుణ్ణి త్యాగగుణం కలవాడివంటూ మెచ్చుకుని, ముక్కుపుడకరాయి రంగు విషయంలో పొరబాటు ఎలా జరిగిందో, తాను గ్రహించాననడం అర్థరహితమే గాక, హాస్యాస్పదంగా కూడా లేదా ? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''శ్రీచంద్రుడు శివదత్తుడి తల్లి చిత్రానికి ప్రతిచిత్రం తయారు చేసేటప్పుడు, కావాలనే ముక్కు పుడకరాయి రంగు విషయంలో అలా చేశాడా లేక పొరబాటువల్ల జరిగిందా ? అన్న సంగతి తేల్చే ముందు, అతడికీ, రాజుకూ మధ్య వున్న స్నేహబంధం గుర్తుంచుకోవాలి. రాజు ఆ తైలవర్ణ చిత్రాన్ని కొద్దిరోజులపాటు తన అంతః పురంలో వుంచుకునేందుకు అడిగితే, నియమభంగం అవుతుందంటూ శ్రీచంద్రుడు ఇవ్వ నిరాకరించాడు. అటు వంటప్పుడు శివదత్తుడు ప్రాధేయపడగానే చిత్రాన్ని అతడికివ్వడం అంటే, రాజుకు తన మీద తప్పక కోపం వస్తుంది. అట్లని తల్లిపై గల ప్రేమా మమకారాల కొద్దీ పుత్రుడు అడుగుతుంటే ఇవ్వననడం అమానుషం అవుతుంది. ఇది గుర్తించడం వల్లనే శ్రీచంద్రుడు కోరి తను గీసిన ప్రతిచిత్రంలో రాయి రంగు మార్చాడు. ఆ విధంగా, శివదత్తుడు అసలైన తన తల్లి చిత్రాన్ని పోల్చుకోగలిగాడు. అసలు చిత్రంలోని అతి చిన్న పుట్టుమచ్చను కూడా, తన చిత్రంలో చిత్రించిన శ్రీచంద్రుడు, ముక్కుపుడకరాయి రంగు విషయంలో అంత పెద్ద పొరబాటు చేస్తాడనుకోవడం వాస్తవ విరుద్ధమవుతుంది. ఇదంతా గ్రహించడంవల్లనే రాజు, అతణ్ణి త్యాగగుణం కలవాడివంటూ మెచ్చుకున్నాడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు.,  —(కల్పితం)

[ఆధారం: ఎస్. శివనాగేశ్వరరావు రచన]



# పుట్టుమచ్చ

చిత్రసేనుడనే రాజుకు పుట్టుమచ్చలశాస్త్రం మీద నమ్మకం జాస్తి. రాజుగారి ఈ బలహీతను పసిగట్టి అందులో అరాకొరా ప్రవేశం గల వారందరూ ఆయన వద్దకు వచ్చి, ఏవో నాలుగు మాటలు చెప్పి డబ్బు పుచ్చుకు పోతూండేవాళ్ళు. ఆయన మంత్రి సువర్ణుడికి, ఈ పరిస్థితి చాలా బాధ కలిగించేది. రాజుగారిని ఈ పిచ్చి నుంచి ఎలా విముక్తుణ్ణి చెయ్యాలా అని ఆలోచిస్తూ, తగిన అవకాశం కోసం ఎదురు చూడసాగాడు.

ఒక రోజు పొరుగు రాజ్యం నుంచి, పుట్టుమచ్చలశాస్త్రంలో మహాపండితుడినంటూ శివగుప్తుడనే అతడు వచ్చాడు. చిత్రసేనుడు, అతణ్ణి తన శరీరం మీది పుట్టుమచ్చలను పరిశీలించమన్నాడు.

శివగుప్తుడు సంచీలో నుంచి భూతద్దం తీసి ఒక్కొక్క మచ్చనే పరీక్షిస్తూ, ఫలితాలను చెప్పసాగాడు. చివరకు మణికట్టు మీది పుట్టుమచ్చను చూసి, "ఏమి మచ్చ, ప్రభూ! ఇది కందిగింజంత వుండబట్టి తమరు మహారాజులయ్యారు. ఇదే చింతగింజంత పరిమాణంలో వుండివుంటే—తమరు చక్రవర్తులయ్యేవారు!" అన్నాడు.

మంత్రి మౌనంగా పక్కనే వున్న కావలిభటుణ్ణి దగ్గరకు రమ్మని సైగచేశాడు. దగ్గరకు రాగానే వాడి కుడిచేతిని చాపమన్నాడు. వాడి మణికట్టు మీద చింతగింజ పరిమాణంలో పుట్టుమచ్చ వున్నది.

ఇది చూసి శివగుప్తుడి ముఖం పాలిపోయింది. ఆనాటితో రాజు చిత్రసేనుడికి పుట్టుమచ్చల పిచ్చి వదిలిపోయింది.

—ఆర్. పట్టాభిరామరాజు






మనదేశపు పక్షులు-జంతువులు :

# నెమలి

మన దేశంలోని పక్షులన్నిటిలోకి చాలా అందమైనది నెమలి. పెద్ద ఆకారం గల మగనెమలి ప్రత్యేక ఆకర్షణ దాని పొడవాటి పింఛం. పింఛం పొడవు దాదాపు 1.2 మీటర్లు వుంటుంది. పింఛం విప్పి చేసే మయూరనాట్యం ఎంతో గంభీరంగా కనిపిస్తుంది. పింఛంలోని బంగారు వన్నె 'కనులు', చూసేవారి కనులకు పండుగ చేస్తుంది. నెమలి తల మీద కిరీటం లాంటి పెద్ద శిఖ అందంగా వుంటుంది.

ఆడనెమళ్ళకు పింఛం వుండదు. వాటి శరీరాల నిండా ఊదారంగు మచ్చలుంటాయి. మెడకు దిగువభాగంలో ఆకుపచ్చ, నీలిరంగు చారలుంటాయి. ఆడ నెమలి తల మీద కూడా శిఖ వుంటుంది. ఇవి ఒక్కసారికి ఐదారుగుడ్లు పెడతాయి.

సాధారణంగా నెమళ్ళు, ధాన్యపు గింజలనూ, లేత చిగుళ్ళనూ, కీటకాలనూ తింటాయి. అప్పుడప్పుడూ తొండలనూ, పాములనూ కూడా పట్టి తింటాయి.

మన పురాణాలు నెమలిని సుబ్రహ్మణ్యస్వామి వాహనంగా పేర్కొంటాయి. తన అందం, ఆకర్షణలతో చూపరులందరినీ అలరించే నెమలి మన జాతీయపక్షి!

# దానం కోసం స్కేటింగ్!

బొంబాయినుంచి ఢిల్లీవరకు 1,600 కి. మీ. దూరం 'రోలర్-స్కేటింగ్' చేసి అందరి దృష్టినీ ఆకర్షించింది బరోడాకు చెందిన ఓ అమ్మాయి. ఇలా విలక్షణమైన సాహసంచేసి, గిన్నిస్ బుక్‌లో స్థానం సంపాయించాలన్నది ఆమె ఉద్దేశం కాదు. గుజరాత్ రాష్ట్రం నవ్‌సారిలోని 'కాలేజ్ ఆఫ్ ఆప్తాల్మాలజీ'కి నిధులు సేకరించడానికే ఆమె స్కేటింగ్ చేసింది. ఇంతకూ ఆ అమ్మాయి ఆ వైద్య కళాశాల విద్యార్థిని కూడా కాదు. ఎనిమిదేళ్ళే నిండిన శీతల్ పాండేయా, బరోడాలోని ఒక పాఠశాలలో మూడవ తరగతి చదువుతున్నది!

ఇది గత వేసవి సెలవులలో జరిగింది. తండ్రి జగదీష్ పాండేయా, మరిద్దరు తోడు రాగా శీతల్ పాండేయా మే ఒకటో తారీఖున బొంబాయిలో బయలుదేరింది. వీరికి సాయంగా మరో ఇద్దరు కారులో బయలుదేరారు. ప్రముఖ సినీనటుడూ, పార్లమెంటు సభ్యుడూ అయిన సునీల్‌దత్ సమక్షంలో, ఆయనశుభాకాంక్షలతో ఈ ప్రయాణం మొదలయింది. మహారాష్ట్ర, గుజరాత్, రాజస్థాన్, హర్యానా రాష్ట్రాలలోని 43 పట్టణాలగుండా ప్రయాణంచేసి, జూన్ 22 వ తేదీ ఢిల్లీ చేరుకున్నది. దారి పొడవునా 2 లక్షల రూపాయలు వసూలయ్యాయి. బొంబాయిలోని ఒక సుప్రసిద్ధ హోటల్ 50,000 ఇచ్చింది. ప్రముఖ బేటరీ తయారీ సంస్థ, శీతల్ సాహసయాత్ర పథకాన్ని ఏర్పాటు చేసి ప్రోత్సహించింది!

అయితే, శీతల్ ఇలాంటి స్కేటింగ్ చేయడం ఇదేం ప్రథమం కాదు. ఆమె ఐదేళ్ళ పాపగా ఉన్నప్పుడే మొట్టమొదటిసారిగా ఢిల్లీనుంచి బొంబాయికి స్కేటింగ్ చేసింది. అప్పుడు వసూలు చేసిన మొత్తాన్ని క్యాన్సర్ రోగులకు సహాయం చేసింది. ఒక సంవత్సరం తరవాత, అహ్మదాబాద్ నుంచి బొంబాయికి 600 కి.మీ. దూరం స్కేటింగ్ చేసింది. ఏడేళ్ళ ప్రాయంలో కలకత్తా నుంచి, కాన్పూరుకు 1,000 కి. మీ. దూరం స్కేటింగ్ చేసింది. అప్పుడు మదర్ థెరెసా ఆ పాపాయిని సాగనంపింది!

శీతల్ సాహసయాత్రకు కారణం ఆమె తండ్రి జగదీష్ పాండేయా. స్వతహాగా క్రీడాసక్తి కలిగిన జగదీష్ ఒక కెమెరాతయారీ సంస్థలో పనిచేస్తున్నాడు. తన కూతురి క్రీడాసక్తినీ, సామర్థ్యాన్ని పసిగట్టి మూడేళ్ల ప్రాయంనుంచే శిక్షణనివ్వసాగాడు. ఒక సంవత్సరం తరవాత ఆమెను 'మారథన్ స్కేటింగ్'కు తీసుకువెళ్లాడు. ఇప్పుడు శీతల్ రోజూ 60 కి. మీ. దూరం స్కేటింగ్ అభ్యాసం చేస్తున్నది.

తన సామర్థ్యం చూసి విదేశీయులు సైతం మెచ్చుకోవాలన్నది శీతల్ పాండేయా ఆశయం. ఆమె అంతర్జాతీయ స్థాయిలో పేరు ప్రఖ్యాతులు పొందాలని ఆశిద్దాం!



# మీకు తెలుసా?

1. ఎలిఫెంటా గుహలు ఎక్కడ ఉన్నాయి?
2. ఎవరెస్టు శిఖరాన్ని మొట్టమొదట ఎప్పుడు ఎవరు అధిరోహించారు?
3. 15 వ శతాబ్దానికి చెందిన ఒక మహనీయుణ్ణి, హిందువులూ, ముస్లింలూ సైతం తమ మతానికి చెందిన వారుగానే భావిస్తున్నారు. ఆయన ఎవరు?
4. క్రీ॥ శ॥ ఒకటవ శతాబ్దంలో ఒక మత ప్రచారకుడు మన దేశానికి వచ్చి, పలువురిని క్రైస్తవులుగా మార్చి, ఇక్కడే ప్రాణాలు కోల్పోయాడు. ఆయన ఎవరు?
5. భారతదేశంలో కెల్లా మొట్టమొదటి లేడీ డాక్టర్ ఎవరు?
6. మనదేశంలో సుప్రీంకోర్టు న్యాయమూర్తి పదవిని అలంకరించిన మొట్టమొదటి వనిత ఎవరు?
7. మనదేశంలోని ఇండియన్ ఎయిర్‌లైన్ విమానాన్ని మొట్టమొదట ఎవరు నడిపారు?
8. భారత వైమానికదళాన్ని ఎప్పుడు ప్రారంభించారు?
9. మొట్టమొదటి భారత వైమానికదళ నాయకుడు ఎవరు?
10. మన దేశంలో కెల్లా అతి ప్రాచీనమైన నౌకానిర్మాణ సంస్థ ఏది? దానిని ఎవరు స్థాపించారు?
11. మనదేశంలో "చిల్డ్రన్స్ ఫిల్మ్ సొసైటీ"ని ఎప్పుడు, ఎందుకు ఏర్పరచారు?
12. మనదేశంలో అత్యధికమైన పశుసంపద కలిగిన రాష్ట్రం ఏది?
13. పులిని మన జాతీయ మృగంగా ఎప్పుడు నిర్ణయించారు?
14. భారతదేశంలో మొట్టమొదటి తపాలా బిళ్ళ ఎప్పుడు వెలువడింది?
15. సిక్కులకు అత్యంత పవిత్రమైన యాత్రాస్థలం ఏది?

## సమాధానాలు

1. బొంబాయి హార్బరు సమీపంలోని ఎలిఫెంటా దీవిలో.
2. 1953 వ సం॥లో. టెన్సింగ్ నార్గే; ఎడ్మండ్ హిల్లరీ.
3. కబీరు.
4. ఏసుక్రీస్తు పన్నెండుగురు శిష్యులలో ఒకరైన సెయింట్ థామస్. క్రీ॥ శ॥ 52 వ సం॥లో ఈనాటి కేరళ ప్రాంతానికి వచ్చారు. 16 ఏళ్ళ అనంతరం ఆయన మద్రాసు సమీపంలో చిన్న కొండమీది చర్చిలో హత్య చేయబడ్డారు.
5. డా॥ ఆనందబాయి జోషి. 1886 వ సం॥లో అమెరికానుంచి ఎం. డి పట్టా పొందిన ఆమె మహారాష్ట్రలో వైద్య వృత్తిని చేపట్టారు. కాని, 1887 వ సం॥ ఫిబ్రవరి 26 వ తేదీ మరణించారు.
6. కేరళకు చెందిన జస్టిస్ ఫాతిమా బీవి.
7. జె. ఆర్. డి. టాటా.
8. 1932 వ సం॥ అక్టోబర్ 8. దీనినే 'విమానదళదినం'గా పరిగణిస్తారు.
9. సుబ్రతోముఖర్జీ.
10. విశాఖపట్నంలోని హిందూస్థాన్ షిప్‌యార్డ్. బొంబాయికి చెందిన సింధియా స్టీమ్ నేవిగేషన్ కంపెనీ.
11. 1955 వ సం॥లో. బాలలచిత్రాల నిర్మాణాన్ని ప్రోత్సహించడానికి, జాతీయ, అంతర్జాతీయ బాలల చలన చిత్రోత్సవాలు నిర్వహించడానికి ఈ సంస్థ రూపొందించబడింది. గత నవంబర్‌లో తిరువనంతపురంలో ఏడవ అంతర్జాతీయ బాలల చలన చిత్రోత్సవం జరిగింది.
12. ఉత్తరప్రదేశ్.
13. 1972 వ సం॥లో. అంతవరకు సింహం జాతీయమృగంగా ఉండేది. సింహాలసంఖ్య తగ్గిపోవడంవల్ల ఈ మార్పు జరిగింది.
14. 1852 వ సం॥లో.
15. అమృతసర్‌లోని గురుద్వారా హర్‌మందిర్ సాహెబ్ (స్వర్ణదేవాలయం)

## శివభక్తవానరం!



ఢిల్లీలోని ఒక శివాలయ ప్రాంగణంలోని చెట్టు మీద కోతి ఒకటి నివస్తుండేది. అది రోజూ వేకువ జామున నాలుగు గంటలకు, చెట్టు దిగివచ్చి, ఆలయంలోని గర్భగృహంముందు భక్తితో చేతులు జోడించుకుని కొంతసేపు నిలబడి మొక్కి, చకచకా చెట్టుమీదికి వెళ్ళిపోయేది. ఆ సమయంలో దైవ దర్శనానికి వచ్చే భక్తులు ఈ వింత వానర భక్తిని చూసి భక్తితో చెంపలు వేసుకునేవారు. ఇలా పదేళ్ళకు పైగా జరిగింది. ఆ వానరం గత నవంబర్ ఒకటవ తేదీ చనిపోయింది. దాని దేహాన్ని, గంగాజలంతో కడిగి, ఊరేగింపుగా యమునా తీరానికి తీసుకుపోయి మంత్రయుక్తంగా అంత్యక్రియలు జరిపారు. దీనికి దాదాపు ఇరవై వేలమంది హాజరయినట్టు తెలుస్తున్నది।

# చందమామ కబుర్లు

## కాకులు తినేవాళ్ళు!



నమ్మశక్యం కాకపోయినా ఇది నిజం। జపాన్‌లోని కిసాకటా అనే సముద్రతీర పట్టణ ప్రజలకు ప్రధాన జీవనోపాధి వ్యవసాయం. వాళ్ళ పంటలకు కాకుల బెడద పెరిగిపోయి, యేటా 7,500 డాలర్ల నష్టం రాసాగింది. దాంతో వాళ్ళకు కాకులపట్ల ఆగ్రహం పెరిగిపోయి వాటిని చంపి కసితీరా తినడం మొదలెట్టారు. మూడేళ్ళుగా, నెలకు రెండువందల కాకుల్ని చంపి, వంటకాలకు పంపి, హాయిగా తినేస్తున్నారు అక్కడి రైతులు।



# దయ్యాలకొంప

కోదండపాణి అనే యువకుడికి పట్నంలో ఉద్యోగమైతే దొరికింది కానీ, ఇల్లు దొరక లేదు. వాడు ఇంటికోసం పదిమందినీ అడిగి అడిగి విసిగిపోయాక, శ్రీమంతు డనే అతడు తటస్థపడి, ''ఊరి చివర నాకో మేడుంది. దానికి దయ్యాలకొంప అని పేరుపడి ఎవరూ ఆ ఇంట్లో వుండడం లేదు. నీ కక్కావాలంటే అందులో వుండొచ్చు. అద్దె కూడా ఇవ్వక్కర్లేదు,'' అన్నాడు.

ఇందుకు కోదండపాణి ఎంతో సంతో షించి ఆ రాత్రే అక్కడికి వెళ్ళాడు.

ఇంటికి తాళం పెట్టి వుంది. కానీ కోదండపాణి మెట్లెక్కుతూండగా, తాళం దానంతటదే విడిపోయింది. తలుపులు వాటంతటవే తెరుచుకున్నాయి. కోదండ పాణికి ఒళ్ళు జలదరించినా ధైర్యంగా లోపలికి వెళ్ళాడు.

ఆ మరుక్షణం తలుపులు వాటంతటవే మూసుకున్నాయి. కొంతసేపటికి లోపల పెద్దగా వెలుగు వచ్చింది. ఎదురుగా కోదండపాణికి అస్పష్టాకారమొకటి కనిపించింది.

''నేనీ ఇంట్లో వుండే పెద్దదయ్యాన్ని. నాతోపాటుండే మిగతా మూడు దయ్యాలూ, నా మాట వింటాయి. నువ్వీ ఇంట్లో వుండాలనుకుంటే నన్ను మెప్పిస్తేచాలు," అన్నదా అస్పష్టాకారం.

కోదండపాణి పెద్దదయ్యానికి దణ్ణం పెట్టి, ''నేనీ ఇంట్లోనే వుంటాను. నువ్వేం చెబితే అది చేస్తాను,'' అన్నాడు.

అప్పుడు పెద్ద దయ్యం మిగతా మూడు దయ్యాలనూ పిలిచి, ''ఇది నా భార్య. వీళ్ళిద్దరూ నా కూతుళ్ళు. నా కూతుళ్ళిద్ద రిలో ఎవరందమైనవారో తేల్చలేక చస్తున్నాను. వాళ్ళిద్దరికీ కోపం రాకుండా

"వసుంధర"



అసలు విషయం చెప్పి, నా సమస్య పరిష్కరించు,'' అన్నది.

కోదండపాణి పిల్లదయ్యాలు రెండింటినీ పరీక్షగా చూసేసరికి, అవి పళ్ళికిలిస్తూ భయంకరంగా నవ్వాయి. వాడు తన భయాన్ని లోలోపలే అణుచుకుని మేకపోతు గాంభీర్యంతో, ''నేను నిజం చెబితే ఒకరికి తప్పకుండా కోపం వస్తుంది. కాసేపు గడువిస్తే ఆ కోపాన్ని చల్లార్చగలను. అందుకు నువ్వొప్పుకుంటావా?'' అని పెద్దదయ్యాన్నడిగితే, అది వెంటనే సరేనన్నది.

కోదండపాణి పిల్లదయ్యాల్లో ఒకదాన్ని వేలితో చూపుతూ, ''ఇద్దరిలోకీ ఇదే అందమైనది. కానీ ఇంత అందముండీ ఇలా తల్లిదండ్రులచాటున వుండిపోయిందేమిటి? హాయిగా ఏ అడవిలోకైనా వెళ్ళిందంటే, మగదయ్యాలు దీన్ని పెళ్ళాడ్డానికి నేనంటే నేనని పోటీ పడవూ?'' అన్నాడు.

అప్పుడా పిల్లదయ్యం పెద్దదయ్యంతో, ''ఈ మనిషి నిజం చెబుతున్నాడు. నేను అడవికి వెళ్ళిపోతాను,'' అని తల్లిదండ్రుల కాళ్ళకు నమస్కరించి ఎగిరి వెళ్ళిపోయింది.

అయితే రెండో పిల్లదయ్యం కోదండపాణి మీద అలిగి, ఇంట్లో ఒక మూలకు వెళ్ళిపోయింది. కోదండపాణి ఆ దయ్యం దగ్గిరకు వెళ్ళి, ''నిజానికి నువ్వే అందగత్తెవు. ఆ విషయం చెబితే నువ్వు ఇంట్లో నుంచి వెళ్ళిపోతావు. మరి నాకు నిన్ను రోజూ చూడాలని కోరిక. అందుకే అబద్ధం చెప్పి దాన్ని బైటికి పంపేశాను,'' అన్నాడు.

పిల్లదయ్యం ఈ మాటలకు కాస్త మెత్తబడి, ''అది సరేకానీ, మళ్ళీ నా అక్క ఇక్కడికి తిరిగివస్తే ఏం చేయాలి?'' అని అడిగింది.

''మళ్ళీ అది ఇక్కడికి వస్తే, దాన్ని చేసుకునేందుకు మగదయ్యాలేవీ ఇష్టపడలేదని అర్థం. అప్పుడది అందగత్తె కాదని

నిర్ధారణ అవుతుంది. అలా జరగడం నీ అక్క కిష్టముండదు. అందుకే మళ్ళీ ఈ ఇంట్లో అడుగుపెట్టదు,'' అన్నాడు కోదండపాణి.

''నువ్వు నా కోపం తగ్గించడానికి అబద్ధం చెబుతున్నావు. నేను నిజంగా అందగత్తెను కాదు,'' అన్నది దయ్యం పగలుపోతూ.

''నేనబద్ధాలు చెబితే అది నీ సంతోషం కోసమేగదా! అయినా, నేను అందమైన వాళ్ళనే తప్ప అర్థమైనవాళ్లను సంతోషపెట్టను,'' అన్నాడు కోదండపాణి లేని కోపం నటిస్తూ.



వెంటనే పిల్లదయ్యం, ''నువ్వు నిజమే చెబుతూంటే, నన్ను పెళ్ళి చేసుకుంటావా?'' అని అడిగింది.

''నేను మనిషిని; నువ్వు దయ్యానివి. మన పెళ్ళి ఎలా సాధ్యం?'' అన్నాడు కోదండపాణి భయంగా.

''నేను కావాలనుకున్నప్పుడల్లా మనిషిగా మారగలను. ఒక మనిషిని పెళ్ళి చేసుకోవాలని కోరిక,'' అన్నది పిల్లదయ్యం.

ఈలోగా పెద్దదయ్యం కోదండపాణి వద్దకు వచ్చి, ''అమ్మాయికి సర్ది చెప్పావా? దాని కోపం తగ్గిందా?'' అన్నది.

''నాన్నా! నన్నీయన పెళ్ళి చేసుకునేందుకు ఒప్పుకున్నాడు,'' అన్నది పిల్లదయ్యం.

ఆ మాటలకు తండ్రి దయ్యం, తల్లి దయ్యం రెండూ కూడా ఆనందం పట్టలేక కీచుమంటూ అరిచి గంతులు వేయసాగాయి.

''మీ గంతులాపండి! పెళ్ళంటే ఊఁ అనగానే అయిపోదు. నాకు కట్నం కావాలి,'' అన్నాడు కోదండపాణి.

''అడగవయ్యా అడుగు. నా పిల్లలిద్దరికీ పెళ్ళి చేయాలన్న కోరికతోనే కదా నేనిక్కడున్నది! నీకేం కావాలో అడుగు, తెచ్చిస్తాను,'' అన్నది పెద్దదయ్యం.



"నాకేమీ అక్కర్లేదు. ఈ ఇల్లు నాకిచ్చేస్తేచాలు!" అన్నాడు కోదండపాణి.

"సరే, తీసుకో!" అన్నది పెద్దదయ్యం.

"అయితే నేనూ, నా భార్య మాత్రమే ఈ ఇంట్లో వుంటాం. మీరిద్దరూ ఇక్కణ్ణించి వెళ్ళిపొండి." అన్నాడు కోదండపాణి.

"ఇది చాలా అన్యాయం. మేమిక్కడుంటే నీకేం నష్టం?" అన్నది పెద్దదయ్యం.

"మీరిక్కడుంటే అంతా నేనిల్లరికం వెళ్ళాననుకుంటారు. అత్తమామల ఇంట్లో వుంటూ, వాళ్ళ సొమ్ము తింటున్నానను కుంటారు. అయినా మీరిక్కడుంటే తప్ప బతకలేరా?" అన్నాడు కోదండపాణి.

"నువ్వు నిజమే చెబుతున్నావు. మేము వెళ్ళిపోతాం. నా కూతురు కాపురం చక్కగావుంటే అదే పదివేలు!" అంటూ పెద్దదయ్యం, భార్యదయ్యం అక్కణ్ణించి కదిలాయి. తల్లిదయ్యం పిల్లదయ్యానికి ఎన్నో నీతులు చెప్పి వెళ్ళింది.

అంతా వెళ్ళిపోయాక, "నీ వాళ్ళందర్నీ ఇంట్లోంచి పంపేశానని బాధగా వుంది నాకు," అన్నాడు కోదండపాణి.

"నువ్వు మంచిపనే చేశావు. అమ్మా నాన్నల కోరిక మా పెళ్ళి ఒక్కటే! మేము మనుషులుగా వున్నప్పుడు నాన్న, మా ఇద్దరికీ పెళ్ళి సంబంధాలు కుదుర్చుకుని వచ్చాడు. ఆ సమయంలో శ్రీమంతుడనే అతను, నాన్నను మోసం చేసి మా పొలమంతా కాజేశాడు. పెళ్ళిళ్లాగిపోయాయి. డబ్బు లేకుండానే తన పెళ్ళవుతుందని, తన అందాన్ని నమ్ముకున్న మా అక్క పెళ్ళికొడుకు వద్దకు వెళ్ళి అవమానపడి వెనక్కు వచ్చి, ఆత్మహత్య చేసుకున్నది. ఆ దుఃఖంలో ఇంటిల్లిపాదీ విషం మింగి చనిపోయాం. మా కుటుంబమంతా పగతీర్చుకునేందుకు శ్రీమంతుడు కొత్తగా కట్టిన ఇంట్లో దూరాం. అదే ఈ ఇల్లు! ఇప్పుడు అక్క ధైర్యంగా తన పెళ్ళి తనే చేసుకుంటానని వెళ్ళింది. నా పెళ్ళి నీతో జరిగింది.

నాకిప్పుడిక ఏ కోరికలూ లేవు!" అంటూ పిల్ల దయ్యం కోదండపాణిని మెచ్చుకున్నది.

"ఇప్పుడిక నీకు ఏ కోరికలూ లేక పోతే, ఇంకా ఇలా దయ్యమై పడివుండడ మెందుకు?" అన్నాడు కోదండపాణి.

అంతే! పిల్లదయ్యం అక్కణ్ణించి మాయమయింది. దాని ఆత్మ స్వర్గానికి పోయుండాలి!

కోదండపాణి ఆ రాత్రంతా అక్కడ సుఖంగా నిద్రపోయాడు. తెల్లవారుతూనే శ్రీమంతుడింటికిపోయి జరిగిందిచెప్పాడు.

శ్రీమంతుడు వాణ్ణి మెచ్చుకుని, "అన్ని విధాలా ప్రయోజకుడివైన నిన్ను, నా అల్లుడుగా చేసుకోవాలనుంది. నీకు నా కూతుర్నిచ్చి పెళ్ళిచేసి, ఆ మేడను కట్నంగా ఇస్తాను. అయితే, ఒక్కగానొక్క కూతురు, దాన్ని వదిలి మేం వుండలేం. మమ్మల్ని కూడా ఆ మేడలో వుండ నివ్వాలి," అన్నాడు.

శ్రీమంతుడి కూతురు తార చాలా అందంగా వుండడంతో, కోదండపాణి పెళ్ళికి వెంటనే ఒప్పుకుంటూ, "మీ అమ్మాయిని పెళ్ళాడడానికి, నాకెలాంటి అభ్యంతరమూలేదు. కానీ ఇల్లరికపుటల్లు డనిపించుకోవడం, నాకు సుతరామూ గిట్టదు. అలా కాకుంటే నేను, ఆ దయ్యం చిన్న కూతుర్నే పెళ్ళాడి వుండేవాణ్ణి. దాని ఆకారం వికారం అయినా, బుద్ధి కడిగిన ముత్యం లాంటిది. ఇక కట్నం మాటకొస్తే—ఈ కట్నాలూ కానుకలంటే, అసలే నాకు సరిపడదు. నాకు ఉద్యోగ మంటూ వున్నది. ఆ వచ్చే జీతంతో నేనూ, మీ కుమార్తె హాయిగా బతగ్గలం," అన్నాడు.

ఆ జవాబుతో శ్రీమంతుడిక చేసేదిలేక, "అయితే, ఒక పని చెయ్యి. ఆ మేడకు దయ్యాలకొంప అన్న పేరొచ్చింది గనక, ఎవరూ దానిలోకి అద్దెకు రారు. నువ్వూ, నీ భార్య అందులో వుండండి!" అన్నాడు.

ఇందుకు కోదండపాణి ఒప్పుకున్నాడు. తర్వాత శ్రీమంతుడి కూతురుతో కోదండ పాణి పెళ్ళి ఘనంగా జరిగిపోయింది.





# వ్యర్థమైన ఖర్చు

పూర్వం సారత్పూర్ అనే చిన్న గ్రామంలో రామసింహుడు అనే షావుకారు ఉండేవాడు. అతనికి డబ్బు ఖర్చు పెట్టట మంటే చాలా అయిష్టం.

ఒకనాడు అతడు ఏదో పని మీద పొరుగూరికి పోతూండగా దారిలో ఒక ఖర్జూరపు చెట్టు కనబడింది. దానినిండా గుత్తులు గుత్తులుగా ఖర్జూరపు పళ్ళున్నాయి. రామసింహుడికి చిన్నప్పటి నుంచీ ఖర్జూరపు పళ్ళంటే చాలా ఇష్టం. ఇప్పుడు వాటిని చూస్తూంటే అతనికి నోరూరింది. అతనికి చెట్టు ఎక్కటం రాదు. కాని, చూస్తూ చూస్తూ ఖర్జూరపు పళ్ళను వదిలి ముందుకు సాగిపోవటానికి మనస్కరించక, అతను ఎలాగో కష్టపడి చెట్టు ఎక్కాడు.

రామసింహుడు తిన్నన్ని పళ్ళు తిని, మరికొన్ని జేబులో వేసుకుని, చెట్టు దిగి పద్దామని కిందికి చూసేసరికి, నేల ఎక్కడో పాతాళంలో ఉన్నట్టు కనబడి, కళ్ళు తిరిగి, కింద పడిపోతానని భయం పుట్టింది. ఆ భయంలో అతను భగవంతుణ్ణి తలుచుకుని, ''స్వామీ, నేను క్షేమంగా కిందికి దిగితే వెయ్యి మందికి సంతర్పణ చేయిస్తాను,'' అని మొక్కుకున్నాడు.

అలా మొక్కుకున్న మీదట ధైర్యం వచ్చి అతను చెట్టు దిగ నారంభించాడు. కొంత దిగినాక కిందికి చూస్తే ప్రమాదం కొంత తక్కువగా ఉన్నట్టు తోచింది. అందుచేత రామసింహుడు, ''వెయ్యి మందికి కాకపోయినా అయిదువందల మందికి సంతర్పణ చెయ్యకతప్పదు. ఇది దేవుడి విషయం,'' అనుకున్నాడు.

ఇంకా కొంచెం దిగినాక అతనికి అయిదు వందల మందికి సంతర్పణ చెయ్యటం చాలా అనవసరమని తోచింది; ఒక వంద మందికి చేస్తే చాలుననిపించింది.



చివరకు అతను క్షేమంగా చెట్టు దిగి, ''అయిదు వందల మంది అలగా జనానికి సంతర్పణ చెయ్యటం ఒక సద్బ్రాహ్మణుడికి సంతర్పణ చెయ్యటంతో సమానం. అందుచేత ఒక సద్బ్రాహ్మణుడికి విందు చేస్తాను,'' అనుకున్నాడు.

అతను ఇంటికి తిరిగి వచ్చేటప్పుడు ఏ బ్రాహ్మణుడికి సంతర్పణ చెయ్యటమా అని ఆలోచించాడు. లావుగా ఉండే వారు ఎక్కువ తింటారు. కాని తమ గ్రామంలో బక్క బ్రాహ్మణు లెవరున్నారు? రామాలయ పూజారి రామశాస్త్రి చాలా బక్కగా ఉంటాడు! అందుచేత అతన్ని విందుకు పిలవ నిశ్చయించి, రామసింహుడు పూజారి ఇంటికి వెళ్ళి, ఆయన్ను మర్నాడు తమ ఇంటికి భోజనానికి ఆహ్వానించాడు.

పిసినారితనానికి పేరు మోసిన రామసింహుడు అకారణంగా తనను భోజనానికి పిలవటం చూసి రామశాస్త్రి అమిత ఆశ్చర్యపడుతూ, అలాగే వస్తానన్నాడు.

రామసింహుడు తిన్నగా ఇంటికి వెళ్ళి తన భార్యతో, ''ఇవాళ వెళ్ళిన పని కాకుండానే ఇంటికి తిరిగి రావలసి వచ్చింది. రేపు మళ్ళీ వెళ్ళాలి. పూజారి రామశాస్త్రిని భోజనానికి పిలిచాను. సాధ్యమైనంత తక్కువ ఖర్చులో అంతా జరిగేటట్టు చూడు.'' అని ఆ రోజు జరిగిన సంగతి ఆమెకు చెప్పాడు.

మర్నాడు ఉదయమే రామసింహుడు పొరుగూరికి ప్రయాణమై వెళ్ళాడు.

భోజనాలవేళకు రామశాస్త్రి రామసింహుడి ఇంటికి వచ్చాడు. రామసింహుడి భార్య ఆయనకు వడ్డన చేసింది. బక్కగా ఉన్నా, రామశాస్త్రి మంచి తిండి పుష్టికలవాడు. ఆయన ముగ్గురు తిన్నంత తిని, తాను తినగా మిగిలిపోయిన పిండివంటలు మూటగట్టుకుని తాంబూలం పుచ్చుకున్నాడు. అందులో దక్షిణ లేదు.

''అమ్మా, సంతర్పణ చేసిన బ్రాహ్మడికి దక్షిణలేని తాంబూలం ఇవ్వటం గృహస్థుకు

మంచిది కాదు. ఇందులో రెండు బంగారు కాసులు పెట్టు,'' అన్నాడు రామశాస్త్రి రామసింహుడి భార్యతో.

చేసేది లేక ఆమె రెండు బంగారు కాసులు తెచ్చి రామశాస్త్రి కిచ్చింది.

ఇది జరిగిన మర్నాడు రామసింహుడు ఇంటికితిరిగివచ్చాడు. బ్రాహ్మణసంతర్పణ ఎలా జరిగిందో, ఎంత ఖర్చు అయిందో, భార్య భర్తకు చెప్పింది. రామసింహుడి గుండెబద్దలయినంతపని అయింది: అతను భార్యను తిట్టి, ''నిన్ను పిచ్చిముండను చేసి ఇల్లు దోచుకుపోయిన ఆ దొంగవెధవ పని పట్టుతాను.'' అంటూ కర్ర తీసుకుని రామశాస్త్రి ఇంటికి బయలుదేరాడు.

ఇలాటిదేదో జరగబోతుందని రామశాస్త్రి ముందే ఊహించి ఉండటం చేత తగిన ఏర్పాట్లన్నీ చేసుకుని ఉన్నాడు. రామసింహుడు తన ఇంటికి వస్తున్నజాడ పొడగట్టగానే ఆయన మంచం మీద పడుకున్నాడు. ఆయన భార్యా, కొడుకూ మంచం దగ్గర చేరి ఏడుస్తున్నారు.

అక్కడికి వచ్చిన రామసింహుణ్ణి చూసి రామశాస్త్రి కొడుకు, ''ఎంత పని చేశారండీ! భోజనానికని పిలిచి మా నాయనకు ఏం పెట్టారో ఏమో గాని, ఇంటికి వస్తూనే వాంతులు చేసుకుని, మంచాన పడి ఉన్నాడు. వైద్యుణ్ణి పిలిస్తే, విషప్రయోగం జరిగింది, విరుగుడుకు నాలుగు బంగారు కాసులు ఖర్చవుతుంది అన్నాడు. ఈ సంగతి ఏమిటో తేల్చుకుందాం, గ్రామ పెద్దల దగ్గరికి పోదాం రండి,'' అన్నాడు.

గ్రామపెద్దలు వైద్యం ఖర్చుతో వదలక, జరిమానాలూ అవీ వేస్తారు. ఆ భయంతో రామసింహుడు, ''బాబూ, వైద్యానికయ్యే డబ్బు నేను అచ్చుకుంటాను. నన్ను వదిలిపెట్టు.'' అని రామశాస్త్రి కొడుకును బతిమాలుకున్నాడు.

రామశాస్త్రి కొడుకు రామసింహుణ్ణి దయతలచినట్టు నటిస్తూ నాలుగు బంగారు కాసులు పుచ్చుకుని, పంపేశాడు.

అటు తరవాత రామసింహుడికి ఖర్జూర పళ్ళు గుర్తుకొస్తే గుండె దడదడలాడేది.






విభీషణుడి విషయంలో హనుమంతుడిచ్చిన సలహా విన్న మీదట రాముడు అందరూ వినేటట్టుగా ఇలా అన్నాడు:

"విభీషణుడు చెడ్డవాడే అయినప్పటికీ, శరణాగతి కోరిన వాడిని విడిచి పుచ్చటం అధర్మం."

"ఇతను చెడ్డవాడైనా, మంచివాడే అయినా అతనితో మనకు ఏం పని?" అని సుగ్రీవుడు అడిగాడు. చిక్కులలో ఉన్న అన్నను విడిచివచ్చిన వాడు కృతఘ్నుడనీ, ఎవరినైనా విడవగలడనీ సుగ్రీవుడి అభిప్రాయం.

రాముడు లక్ష్మణుడితో సుగ్రీవుడి అభిప్రాయాన్ని ఖండిస్తూ మాట్లాడాడు. జ్ఞాతుల మధ్య వైరం ఉంటుంది. అన్నకు భయపడి విభీషణుడు వచ్చాడు. అతనికి అన్న రాజ్యం కావాలి. అందుచేత అతను రాముణ్ణీ, వానరులనూ విడిచి పుచ్చడు.

"మనల్ని చంపటానికి రావణుడే ఇతన్ని పంపి ఉంటాడు. ఇతన్ని చేరదీయటం అపాయకరం," అన్నాడు లక్ష్మణుడు. రావణుడి తమ్ముణ్ణి ఎలా నమ్మటమని సుగ్రీవుడు అడిగాడు.

కాని రాముడు శరణాగతుడికి ఆశ్రయమివ్వటం పరమ ధర్మమనీ, అతణ్ణి నిరాకరించటం మహా పాపమనీ, అతను విభీషణుడి వేషంలో వచ్చిన రావణుడే అయినా చేరదీస్తాననీ చెప్పి, అతన్ని తీసుకురమ్మని సుగ్రీవుడితో అన్నాడు.

20. శుకుడి రాయబారం

సుగ్రీవుడు వెళ్ళి, వెంటనే విభీషణుడితో తిరిగి వచ్చాడు. విభీషణుడు, తన వెంట ఉన్న నలుగురు రాక్షసులతో సహా రాముడి పాదాలకు వందనం చేసి, ''నేను రావణుడి తమ్ముణ్ణి. అతను నన్ను అవమానించాడు. అందుచేత నిన్ను శరణుజొచ్చాను. అందుకోసం నేను లంకలోని నా వాళ్ళందరినీ, బంధుమిత్రులనూ, భార్యాబిడ్డలనూ, నా సంపద అంతటినీ వదిలి పెట్టాను. ఇక నా రాజ్యమూ, జీవితమూ, సుఖమూ నీ అధీనంలో ఉన్నాయి,'' అన్నాడు.

రాముడి చెవులకు ఈ మాటలు ఎంతో మధురంగా సోకాయి. అతను విభీషణుణ్ణి రాక్షసుల బలాబలాలు వివరించి చెప్పమని అడిగాడు. విభీషణుడు ఇలా చెప్పాడు :

బ్రహ్మదేవుడి వరం వల్ల రావణుడు గంధర్వులకుగాని, నాగులకుగాని, రాక్షసులకుగాని, ఏ భూతాలకుగాని ఓడడు. అతని తమ్ముడూ, విభీషణుడికి అన్నా అయిన కుంభకర్ణుడు పరాక్రమంలో ఇంద్రుడికి తీసిపోడు. రావణుడి కొడుకు ఇంద్రజిత్తు తన వేళ్ళకూ, శరీరానికీ అభేద్యమైన కవచాలు ధరించి, యుద్ధం చేస్తూనే అదృశ్యం కాగలడు; అందుకోసం అతను యుద్ధం మధ్యలోనే అగ్నిని అర్చిస్తాడు. రావణుడి సేనాపతులు దిక్పాలకులకు సమమైన పరాక్రమం కలిగిన వాళ్ళు. ఇష్టం వచ్చిన రూపం



ధరించగల రాక్షసులు లంకలో అసం ఖ్యాకులున్నారు. అలాటి రాక్షసుల సహాయంతో రావణుడు దిక్పాలకులను జయించాడు.

అంతా విని రాముడు, "నేను రావణుణ్ణి అతని రాక్షస వీరులనూ చంపి, నిన్ను లంకకు రాజుగా చేస్తాను. ఇది నా ప్రతిజ్ఞ. రావణుణ్ణి అతని బంధువులతో సహా చంపక నేను అయోధ్యకు తిరిగి వెళ్ళను. నా తమ్ముల మీద ప్రమాణం చేసి చెబుతున్నాను," అని విభీషణుడితో అన్నాడు.

ఈ మాట విని విభీషణుడు రాముడికి సాష్టాంగ నమస్కారం చేసి, "నేను కూడా నా శక్తికొద్దీ రాక్షసులను చంపటానికీ, లంకానగరాన్ని జయించటానికి సహాయపడతాను; శత్రువులతో యుద్ధం చేస్తాను," అన్నాడు.

రాముడు సంతోషంతో విభీషణుణ్ణి కౌగలించుకుని, లక్ష్మణుడితో, "లక్ష్మణా, సముద్రజలం తెచ్చి, విభీషణుణ్ణి రాక్షస రాజుగా అభిషేకించు," అన్నాడు.

వానరుల మధ్య విభీషణుడికి రాక్షస రాజ్యాభిషేకం జరిగింది. వానరులు సింహనాదాలు చేసి, రాముణ్ణి పొగడారు.

తరవాత సుగ్రీవుడూ, హనుమంతుడూ ఏకాంతంగా విభీషణుడితో, "మనమంతా ఈ వానరులతో సహా ఈ మహాసముద్రాన్ని ఎలా దాటటం?" అన్నారు.

దానికి విభీషణుడు, "రాముడు సముద్రుడి శరణు పొందాలి. రాముడి





పూర్వుడైన సగరుడు సముద్రానికి ఎంతో మేలు చేశాడు కనక, సముద్రుడు రామ కార్యానికి అన్ని విధాలా సహాయపడ తాడు,'' అన్నాడు.

సుగ్రీవుడు రామ లక్ష్మణులు ఉన్న చోటికి వచ్చి, విభీషణుడు చెప్పిన మాట చెప్పాడు. రాముడు విభీషణుడి సలహాతో తృప్తిపడి, సుగ్రీవుణ్ణీ, లక్ష్మణుణ్ణీ వాళ్ళ అభిప్రాయం అడిగాడు. వాళ్ళు కూడా విభీషణుడి అభిప్రాయాన్ని బలపరిచారు.

అప్పుడు రాముడు సముద్ర తీరాన దర్భలు పరిచి, వాటి పైన పడుకున్నాడు.

ఇదే సమయంలో రావణుడి చారుడైన శార్దూలుడు అనే రాక్షసుడు వచ్చి, వానర సేన అంతా కలయజూసి వెళ్ళి, రావణుడితో ఇలా చెప్పాడు:

''వానర భల్లూక సేన మరో సముద్రం లాగున్నది. రామలక్ష్మణులు ఉత్తమాయుధాలు ధరించి, సీత కోసం రావటానికి సిద్ధంగా ఉన్నారు. వాళ్ళు సముద్రం దగ్గిర విడిసి ఉన్నారు. నేను పైపైన చూసి వచ్చాను. వివరంగా చూసి రావటానికి ఎవరినైనా పంపు.''

రావణుడు శుకుడు అనే రాక్షసుడితో, సుగ్రీవుడితో ఇలా చెప్పమన్నాడు:

''సుగ్రీవుడా, నేను రాముడి భార్యను తీసుకురావటానికి, వానరరాజువైన నీకూ ఏమిటి సంబంధం? ఏమీ లేదు! నువ్వు బుద్ధిమంతుడివి. బాగా ఆలోచించుకుని, కిష్కింధకు తిరిగి వెళ్ళు. దేవతలూ, గంధర్వులూ ప్రవేశించలేని లంకానగరాన్ని వానరులు ప్రవేశిస్తారన్నది వట్టి మాట.''

శుకుడు రావణుడి సందేశాన్ని విని, పక్షి రూపం ధరించి, వానరసేనలున్న ఉత్తర తీరానికి చేరాడు. వాడు సుగ్రీవుడికి ఎగువగా ఆకాశంలోనే ఉండి, రావణుడు చెప్పమన్న మాటలు చెప్పాడు.

అలా మాట్లాడే శుకుణ్ణి చంపేద్దామని వేగంగా కొందరు వానరులు ఆకాశంలోకి లేచి, శుకుణ్ణి పట్టుకుని నేలకేసి కొట్టారు.



శత్రువువు. వాలి చచ్చినట్టు నువ్వూ చస్తావు. నేను నిన్నూ, నీ కొడుకులనూ, బంధువులనూ, దాయాదులనూ చంపేస్తాను. త్వరలోనే మహాసేనతో లంకకు వచ్చి, దాన్ని నిర్మూలిస్తాను. రాముడి బారినుంచి నిన్ను దేవేంద్రాదులు కూడా రక్షించలేరు. సీతను అపహరించటం గొప్ప కాదు. రామలక్ష్మణులకు భయపడి, వాళ్ళు లేని సమయంలో ఆ పని చేశావు. వాళ్ళ చేతిలో నీకు చావు మూడింది.''

ఈ సందేశంతో శుకుడు వెళ్ళిపోకుండా అంగదుడు అడ్డు తగిలి, సుగ్రీవుడితో, ''వీడు దూత కాదు. రావణుడి వేగుల వాడులాగున్నాడు. మన సేనలను పరిశీలిస్తున్నాడు,'' అన్నాడు.

వెంటనే సుగ్రీవుడు శుకుణ్ణి పట్టుకోమని వానరులను ఆజ్ఞాపించాడు. శుకుడు మళ్ళీ వానరులకు చిక్కి, ''అయ్యో, నా రెక్కలు విరిచారు. కళ్ళు పీకుతున్నారు.'' అని ఆక్రోశించేసరికి, రాముడు అడ్డుపడి, వాణ్ణి వానరుల బారి నుంచి విడిపించాడు.

తరవాత రాముడు సముద్రతీరాన దర్భలు పరిచి, సముద్రానికి నమస్కారం చేసి, చెయ్యి తల కింద పెట్టుకుని దర్భల మీద పడుకున్నాడు. అతని ముఖం సముద్రం కేసి ఉన్నది. అతను అలా

వాడు రాముడితో, ''రాముడా, దూతను చంపవచ్చునా? ఈ వానరులు నన్ను చంపేస్తున్నారు. వద్దని చెప్పు.'' అన్నాడు.

రాముడు వానరులను వారించాడు. శుకుడు రెక్కలు విదిల్చి, ఆకాశంలోకి ఎగిరి, ''సుగ్రీవా, రావణుడితో ఏం చెప్పమంటావు?'' అని అడిగాడు.

సుగ్రీవుడు రావణుడితో తన మాటగా ఇలా చెప్పమని శుకుడితో అన్నాడు:

''నువ్వు నాకు స్నేహితుడివి కావు. నువ్వు నాకు ఎలాటి ఉపకారమూ చేసి ఉండలేదు. పైపెచ్చు నా స్నేహితుడైన రాముడికి శత్రువువు. నా శత్రువైన వాలికి మిత్రుడివి. ఈ రెండు విధాలా నాకు

పడుకుని, సముద్రుణ్ణి ధ్యానిస్తూ మూడు రాత్రులు గడిపాడు. కాని సముద్రుడు ప్రత్యక్షం కాలేదు.

రాముడికి కోపం వచ్చింది. కళ్ళు ఎర్రబడ్డాయి. అతను లక్ష్మణుడితో, "ఈ సముద్రుడు ఎందుకు రాడు? అతడికి ఎంత గర్వం! నా బాణాలతో ఈ సముద్రంలోని ప్రాణులన్నిటినీ చంపి, సముద్రాన్ని అల్లకల్లోలం చేస్తాను. నా విల్లూ, బాణాలూ తీసుకురా." అన్నాడు.

లక్ష్మణుడు వాటిని తెచ్చి ఇచ్చాడు. రాముడు విల్లు ఎక్కుపెట్టి, వజ్రాయుధాల లాటి బాణాలను సముద్రం మీద ప్రయోగించాడు. అవి సముద్రజలంలో ప్రవేశించి, తరంగాలూ, పొగలూ భయంకరంగా లేపాయి.

రాముడు ఇంకా బాణాలు వేయబోవటం చూసి, ఇలా అయితే మూడు లోకాలూ మండిపోతాయనుకుని, "వద్దు, వద్దు. మరి బాణాలు వేయకు," అంటూ రాముడి విల్లు పట్టుకున్నాడు లక్ష్మణుడు.

అయితే ఇంకా సముద్రుడు కనిపించలేదు. అందుచేత రాముడు సముద్రుడితో, "ఓ సముద్రుడా, నిన్ను నా బాణాలతో ఎండగట్టేసి, ఎడారి చేసేస్తాను. నా బలపరాక్రమాలను నువ్వు ఊహించను కూడా



లేవు. నీ అజ్ఞానానికి కారణం నీలో ఉన్న దానవులతో నువ్వు చేసిన స్నేహం అయి ఉంటుంది," అన్నాడు.

ఇలా అని రాముడు తన వింటికి బ్రహ్మాస్త్రం సంధించి, చెవిదాకా లాగి, విడవటానికి సిద్ధంగా ఉండగా, ఆకాశమూ, భూమీ దద్దరిల్లాయి. కొండలు గజగజలాడాయి. ఒక్కసారిగా చీకటి కమ్మినట్టయింది. ఆకాశంలో ప్రచండమైన వాయువులు వీచాయి. ప్రాణులు ఆర్తనాదాలు చేశాయి. సముద్రం ఒక యోజనం వెనక్కు తీసింది. అది చూసి రాముడు తన అస్త్రాన్ని వదలడం మానుకున్నాడు.

అంతలో సముద్ర మధ్యంలో సముద్రుడు కనిపించాడు. అతడి శరీరం వైడూర్యకాంతి కలిగి ఉన్నది. అతను దివ్యపుష్పమాలికలు ధరించి, బంగారు ఆభరణాలు అలంకరించుకుని, గంగా, సింధు మొదలైన నదులను వెంటబెట్టుకుని సాక్షాత్కరించాడు.

సముద్రుడు రాముడి వద్దకు వచ్చి, చేతులు జోడించి, "రామా! లోతూ, గాంభీర్యమూ నా సహజ గుణాలు. నా జలాన్ని స్తంభించటం నాకు శక్యం కాదు. నా చేతిలో ఉన్నదేమంటే, నీ సేన నన్ను దాటేదాకా సముద్రప్రాణుల వల్ల మీకు ఎలాటి భయమూ లేకుండా నేను చూడగలను," అన్నాడు.

"అలా అయితే ఈ ఎక్కుపెట్టిన బాణాన్ని ఎక్కడ ప్రయోగించను?" అని రాముడు సముద్రుణ్ణి అడిగాడు.

"ఇటు ఉత్తరంగా ఒక ప్రదేశం ఉన్నది. అక్కడ అభీరులనే పాపాత్ములు ఉండి, పాపకార్యాలు చేస్తున్నారు. నీ బాణాన్ని వారిపైన ప్రయోగించి, సర్వనాశనం చెయ్యి," అన్నాడు సముద్రుడు రాముడితో.

రాముడు సముద్రుడు చెప్పినట్టే చేశాడు. అది పడినచోటు సర్వనాశనమయిపోయింది. బాణం పడినచోట పాతాళజలం పైకి వచ్చింది. దానికి వ్రణకూపమని పేరు.

తరవాత సముద్రుడు రాముడితో, "నలుడు అనే వానరుడు విశ్వకర్మ కొడుకు. ఇతను సముద్రంమీద సేతువు కట్టుతాడు. ఆ సేతువు నీటిలో మునిగిపోకుండా నేను చూస్తాను," అని చెప్పి అంతర్ధానమయ్యాడు.

నలుడు రాముడితో తాను విశ్వకర్మ కొడుకునేననీ, విశ్వకర్మ నుంచి వరాలు పొందాననీ, సేతువు కట్టటం తనకు సాధ్యమేననీ, కావాలంటే వానరులు అప్పటికప్పుడే సేతువును కట్టటం కాలయాపన చెయ్యకుండా ప్రారంభించవచ్చుననీ అన్నాడు.





# మూడు ప్రశ్నలు

పూర్వం చందనదేశంలోని, మణిగిరి అనే కొండపక్కగా, శారదానదితాలూకు పాయ ఒకటి ప్రవహిస్తూండేది. దానికి రెండు, మూడు క్రోసులదూరంలోని గౌరీపురమనే పల్లెలో, రామశర్మ అనే పండితుడుండే వాడు. ఆయన మంచి పండితుడే కాక, ఆశుకవి కూడా.

రామశర్మ చెల్లెలైన సుభద్ర భర్త గౌరీనాథశాస్త్రి, చందదేశపు రాజాస్థాన పండితుడు. అతడు కూడా మంచి పండితుడే అయినప్పటికీ, గొప్ప అహంకారి. ఆయన ఒకసారి, రామశర్మ కూతురి బాలసారె సందర్భంగా, భార్యతోపాటు గౌరీపురం వచ్చాడు.

ఆయన రామశర్మతో పిచ్చాపాటీ మాట్లాడుతూ, "రాజధానికి రారాదటయ్యా! నేనున్నాను గదా, గౌరీనాథశాస్త్రి బావమరిదినని చెబితేచాలు, రాజు కళ్ళు మూసుకుని నిన్ను ఆస్థానపండితుణ్ణి చేస్తాడు," అంటూ పెద్దగా నవ్వాడు.

రామశర్మకు ఉన్న పొలాన్ని వ్యవసాయం చేసుకుంటూ బ్రతకడమే ఇష్టం. అందువల్ల ఆయన గౌరీనాథశాస్త్రితో, "నాకు ఆస్థానపదవులూ అవీ ఏవీ వద్దులే, బావా! సత్కవులైనవాళ్ళు, పొలం దున్నుకుని బ్రతకడం గౌరవప్రదమే, అన్నారుగదా మహాకవులు," అన్నాడు చిన్నగా నవ్వుతూ.

ఆ మాట గౌరీనాథశాస్త్రికి చురుక్కుమన్నది. అప్పటికాయన మౌనంగా వూరుకున్నా, తర్వాత బావమరిది తనను అవమానించాడన్న బాధ ఆయనను పట్టి పీడించసాగింది. ఆనాటి నుంచీ, ఆయన భార్య సుభద్రను పుట్టింటికి పంపక పోవడమే కాక, తను కూడా అత్తవారింటి వైపు చూడడమే మానుకున్నాడు.



ఆ విధంగా, ఆ అన్నా చెల్లెళ్ళ కుటుంబాల మధ్య రాకపోకలు ఆగిపోయి, పదిహేనేళ్ళయింది. ఇప్పుడు రామశర్మ ఒక్కగానొక్క కూతురు శారద, పదిహేనేళ్ళ పడుచు.

ఇది ఇలా వుండగా, గౌరీపురానికి సమీపాన వున్న కళ్యాణదుర్గంలో, రామశర్మ బంధువుల ఇంట పెళ్ళి జరిగింది. ఆ పెళ్ళికి సకుటుంబంగా వెళ్ళిన రామశర్మ, అక్కడ చెల్లెలు సుభద్రను చూసి, అప్యాయంగా పలకరిస్తూ, ''బావ కూడా వచ్చాడా, అమ్మా?'' అని ప్రశ్నించాడు.

కొన్ని సంవత్సరాల తర్వాత అన్నగారిని చూసిన సుభద్ర, ఆనందబాష్పాలు రాలుస్తూ, ''లేదన్నయ్యా! నీ మేనల్లుణ్ణి తీసుకుని, నేనొక్కదాన్నే వచ్చాను.'' అంటూ ఇరవై సంవత్సరాల తన కొడుకు మాధవుణ్ణి పిలిచి, అన్నకు పరిచయం చేసింది.

వినయంగా మేనమామకు నమస్కరించాడు మాధవుడు. మేనల్లుడి వినయశీలతనూ, బుద్ధికుశలతనూ గమనించి ముగ్ధుడయ్యాడు, రామశర్మ. అదే విధంగా, సౌందర్యమూ, సౌశీల్యమూ మూర్తీభవించినట్టున్న మేనగోడలు శారదను చూసి, పరవశించిపోయింది సుభద్ర.

ఆమె, రామశర్మతో, ''అన్నయ్యా! నీ కూతుర్ని చూస్తున్నకొద్దీ, అది నా కోడలైతే ఎంత బాగుంటుందోనన్న ఆలోచన నన్ను నిలవనివ్వడం లేదు. విడిపోయిన మన రెండు కుటుంబాలూ కూడా, మళ్ళీ కలుసుకుంటాయి. ఏమంటావు?'' అన్నది.

సుభద్ర మాటలకు రామశర్మ దంపతులిద్దరూ చాలా సంతోషించి, ''మా నోటి వెంట రావలసిన మాట, ముందుగా నీ నోటి నుంచే రావడం, మా అదృష్టం! కాని, బావ దీనికి అంగీకరిస్తాడా అన్నదే సమస్య.'' అన్నాడు రామశర్మ.

అన్న అంగీకరించగానే, సగం సమస్య తీరినట్టు తేలిగ్గా నిట్టూర్చిన సుభద్ర,

''ఆయన ధోరణి చూస్తూంటే, ఇదివరకటి పంతాన్ని, చాలావరకు మర్చిపోయారనే అనిపిస్తున్నది, అన్నయ్యా! మంచి రోజు చూసుకుని, నువ్వు మా ఇంటికి రా! నీ కూతుర్ని మాధవుడికి చేసుకోమని, అయన్నడుగు. ఆ పైన భగవంతుడి దయ.'' అన్నది.

కొద్ది రోజులు గడిచాయి. మంచి రోజు చూసుకుని చెల్లెలి ఇంటికి బయలుదేరాడు రామశర్మ. ఈలోపలే, సుభద్ర తన భర్తతో—పెళ్ళిలో మాధవుణ్ణి చూసిన దగ్గిర నుంచీ, తన అల్లుడుగా చేసుకోవాలని రామశర్మ ఉవ్విళ్ళూరుతున్నాడనీ, మంచి రోజు చూసుకుని తమ ఇంటికి వస్తాడనీ చెప్పింది.

ఈ మాట విన్న గౌరీనాథశాస్త్రి, మరింత గర్వంతో పొంగిపోతూ, ''పిల్ల నాకు పూర్తిగా నచ్చనీ, చూద్దాం!'' అన్నాడు భార్యతో నిర్లక్ష్యంగా.

ఆ తర్వాత వారం రోజులకు, తన ఇంటికి వచ్చిన బావమరిది రామశర్మతో కూడా అదే నిర్లక్ష్యధోరణిలో, ''ఇంతకూ నీ కూతురు ఏమైనా చదువుకున్నదా?'' అని ప్రశ్నించాడు, కాస్త వెటకారంగా గౌరీనాథశాస్త్రి.

రామశర్మ కోపాన్ని అణచుకుంటూ, ''నా కూతురు విద్య గురించి, నేను చెప్పుకోవడం తగదుకానీ, శారద సార్థక నామధేయురాలు, బావా!'' అని సౌమ్యంగా జవాబిచ్చాడు.





అందుకు గౌరీనాథశాస్త్రి అయిష్టంగా తలాడిస్తూ, ''కాకిపిల్ల కాకికి ముద్దే, కాదనేందుకు లేదు! నా కాబోయే కోడలి పాండిత్యాన్ని పరీక్షించవలసింది, నేను,'' అన్నాడు.

బావగారి మాటలతో, ఉన్న ఆశ కాస్తా అడుగంటగా, భారమంతా భగవంతుడిపై వేసి, బావగారిని సకుటుంబంగా పెళ్ళి చూపులకు ఆహ్వానించాడు, రామశర్మ. గౌరీనాథశాస్త్రి పంచాంగం చూసి, తాము ఏ రోజు వచ్చేదీ నిర్ణయించి చెప్పాడు.

ఆ రోజున, శారదానది ఒడ్డుకు బండి పంపిస్తానని చెప్పి, బావగారి దగ్గిర సెలవు తీసుకున్నాడు, రామశర్మ.

గౌరీనాథశాస్త్రి వస్తానన్న రోజున, రామశర్మ ఏవో పనుల్లో వుండి, తనకు వరుసకు తమ్ముడైన ఒక బంధువును, ఒక పాలేరును బండి ఇచ్చి పంపాడు. వాళ్ళతోపాటు, రామశర్మ ఇంటి పనివాడి కొడుకు, మల్లిఖార్జునుడనే పదేళ్ళ కుర్రవాడు కూడా బయలుదేరాడు.

స్వతహాగా చురుకైన మల్లిఖార్జునుడు, గౌరీనాథశాస్త్రి కుటుంబం శారదానది ఒడ్డున పడవ దిగింది మొదలు వారి సామానులు మోస్తూ, ఏవో కబుర్లు చెబుతూ, గౌరీనాథశాస్త్రిని ఆకట్టుకున్నాడు. బండి చివర కూర్చున్న శాస్త్రి, మల్లిఖార్జునుడి కబుర్లు వింటూ ఏవో అడుగుతున్నాడు.

ఉన్నట్టుండి శాస్త్రి చేతి మీద చీమ ఒకటి కుట్టింది. ''అబ్బ!'' అనుకుంటూ ఆయన చీమను కసిగా నలిపి చంపేశాడు.

ఆ తర్వాత మల్లిఖార్జునుడి కేసి చూస్తూ, ''ఇంతకూ, మీ అమ్మాయిగారు చదువుకుందిరా?'' అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నకు వాడు ఫక్కున నవ్వుతూ, ''నేనే మా అమ్మాయిగారి దగ్గిర చదువుకుంటూంటే, ఆవిడ చదువుకుందా లేదా అంటారేమిటి, బాబూ?'' అన్నాడు.

''ఓహో, నువ్వు మీ అమ్మాయిగారి శిష్యుడివన్న మాట! ఎంతవరకూ చదువు

కున్నావేం?" అని అడిగాడు గౌరీనాథ శాస్త్రి.

"ఏమో, అదంతా నాకు తెలియదు గాని, మిమ్మల్ని ఏవైనా ప్రశ్నలడగమంటే తెలిగ్గా అడిగేయగలను." అన్నాడు మల్లిఖార్జునుడు.

"నా పాండిత్యాన్నే పరీక్షించేంత గొప్పవాడివన్న మాట! సరే, అడుగు. కాని, ఒక్క నియమం!" అన్నాడు శాస్త్రి.

"ఏమిటా నియమం?" అన్నాడు మల్లిఖార్జునుడు.

"నువ్వు గెలిస్తే, మీ అమ్మాయిగారు గెలిచినట్టు. నువ్వోడిపోతే, మీ అమ్మాయి గారు ఓడిపోయినట్టు. సరేనా?" అన్నాడు శాస్త్రి.

ఆ మాట వినగానే బండిలో వున్న సుభద్రా, మాధవుడూ కంగారుగా ముఖాలు చూసుకున్నారు. సుభద్ర, మల్లిఖార్జునుణ్ణి కసిరి, భర్తను వారించబోయింది. కాని శాస్త్రి అదేం పట్టించుకోకుండా, మల్లిఖార్జునుడి వైపు తిరిగి, "ఆ ప్రశ్నలేమిటో అడగరా!" అన్నాడు.

"నేను మూడే ప్రశ్నలడుగుతాను, బాబూ! మీరు వాటికి జవాబులు చెప్పలేక పోతే, ఓడిపోయినట్టు ఒప్పుకోవాలి," అన్నాడు మల్లిఖార్జునుడు.

శాస్త్రి అంగీకరించాడు.

"సరే, చెప్పండి! చీమలరాక్షసుడు ఎవరు?" అని అడిగాడు మల్లిఖార్జునుడు.





"మనిషికి ముఖ్యంగా కావలసిందేమిటి?" అన్నాడు మల్లిఖార్జునుడు.

"విజ్ఞానం, పాండిత్యం!" శాస్త్రి వెంటనే జవాబిచ్చాడు.

మల్లిఖార్జునుడు నవ్వుతూ, "కాదు, బాబూ! గడుసుదనం, లౌక్యం. నా గడుసుదనంతోనే పండితులైన మిమ్మల్ని మొదటి ప్రశ్నతోనూ, ఇప్పుడు ఈ రెండో ప్రశ్నతోనూ గెలిచాను. కాదంటారా?" అన్నాడు.

శాస్త్రి కాదనలేకపోయాడు. అతడిలోని అహంకారపుపొర, మల్లిఖార్జునుడి మాటలతో, నెమ్మదిగా కరగసాగింది.

"సరే, ఆ ప్రశ్న వినండి! కోడలికి అత్తమామల మీద వుండవలసిందేమిటి?" అన్నాడు మల్లిఖార్జునుడు.

"భయభక్తులు, గౌరవం!" శాస్త్రి సంశయిస్తూనే జవాబిచ్చాడు.

"కాదు. అభిమానం!" అంటూ మల్లిఖార్జునుడు నవ్వి, "అత్తమామలు మంచివాళ్ళయితే, కోడలికి తప్పక భక్తి గౌరవాలుంటాయి. కాని, అభిమానించే కోడలు, అత్తమామలు ఎలాంటి వాళ్ళయినా, బంధానికి విలువనిచ్చి, ఆదరించి అభిమానిస్తుంది!" అన్నాడు.

ఈసారి వెంటనే నోరు విప్పలేకపోయాడు, గౌరీనాథశాస్త్రి. బండిలో వున్న

ఆ ప్రశ్న విని శాస్త్రి తెల్లబోయి, "ఇదేదో కాకమ్మకథలో పేరులా వుంది. ఇలాంటి ప్రశ్నలడగడానికి వీల్లేదు," అన్నాడు.

"ఇది ఏ కథలో పేరూ కాదు, బాబూ! కాస్త ఆలోచిస్తే మనకే తెలుస్తుంది. మీకు తెలియకపోతే, నేనే చెబుతా!" అన్నాడు మల్లిఖార్జునుడు. గౌరీనాథశాస్త్రి, నాకు తెలియదు అనక తప్పిందికాదు.

"చీమలరాక్షసుడు మనిషే! చిటికెనవేలితో గట్టిగా నొక్కితే చచ్చిపోతుంది. మరి మనిషి, ఆ చీమ పాలిటి రాక్షసుడు కాదా?" అన్నాడు మల్లిఖార్జునుడు.

శాస్త్రి లోలోపలే ఆనందిస్తూ, పైకి, "సరేలే, రెండో ప్రశ్న అడుగు!" అన్నాడు.

తల్లీకొడుకు లిద్దరూ మాత్రం, ముఖాలు చూసుకుని చిన్నగా నవ్వుకున్నారు.

కొద్ది క్షణాలు గడిచాక శాస్త్రి, "అయితే మీ అమ్మాయిగారు, నీకీ ప్రశ్నలు నేర్పి పంపిందా ?" అని ప్రశ్నించాడు.

మల్లిఖార్జునుడు క్షణం తటపటాయించి, "లేదు, బాబూ! మా అమ్మాయిగారు, నాకు కేవలం ఆలోచించడం మాత్రమే నేర్పారు. ఆలోచిస్తూంటే అన్నీ మనకే తెలుస్తాయట. మీరు వస్తున్నారని తెలియగానే, నేను సంబరపడుతూంటే— ఈ సంబంధం కుదిరేదికాదులేరా, అన్నారు అమ్మాయిగారు. అందుకని, నేనే మొదటి రెండు ప్రశ్నలూ ఆలోచించి, మూడో ప్రశ్న ద్వారా, నా ఆలోచన మీకు చెప్పేశాను, అంతే! ఇందులో మా అమ్మాయిగారి ప్రమేయం ఏమీలేదు," అన్నాడు.

బండి ఇంటిని సమీపించగానే, రామశర్మ ఎదురువచ్చి, అందర్నీ సాదరంగా ఆహ్వానించి లోపలికి తీసుకు వెళ్ళాడు. తండ్రి పిలిచిన మీదట, శారద వచ్చి, వినయంగా శాస్త్రి దంపతు లిద్దరికీ నమస్కరించి వెళ్ళింది.

భోజనాలై విశ్రాంతిగా కూర్చున్న సమయంలో, రామశర్మ, "బావా! అమ్మాయిని పిలవమంటావా ?" అని అడిగాడు.

"దేనికి ?" అర్థం కానట్టు ప్రశ్నించాడు గౌరీనాథశాస్త్రి.

"అమ్మాయి విద్యాకౌశలాన్ని పరీక్షిస్తానన్నావు గదా !" అన్నాడు రామశర్మ.

దానికి గౌరీనాథశాస్త్రి నవ్వుతూ, "నీ కూతురు తరఫున ఆమె శిష్యుడు, మూడే మూడు ప్రశ్నలతో నన్ను ఓడించాడయ్యా! అంతేకాదు, నాకు ఆలోచించడం కూడా నేర్పాడు. బాగా ఆలోచించి చెబుతున్నాను, నీ కూతురు నాకు పరిపూర్ణంగా నచ్చింది. ఇక నువ్వు లగ్నం పెట్టించడమే తరువాయి!" అన్నాడు.

శాస్త్రి మాటలకు రామశర్మతో బాటు, అందరి ముఖాలూ ఆశ్చర్యానందాలతో కలకల్లాడాయి.





# తెల్ల ఏనుగు!

పూర్వం బర్మాదేశంలోని, ఒక చిన్న రాజ్యాన్ని హెూలాంగ్ అనే రాజు పాలిస్తుండేవాడు. దాని రాజధానీ నగరంలో క్యాంగ్‌యూ అనేవాడు, ఎంత మాసిన బట్టలనైనా సరే శుభ్రంగా ఉతికి చలవ చెయ్యడంలో చాలా ప్రసిద్ధికెక్కాడు.

ఒకనాటి ఉదయంవేళ క్యాంగ్‌యూ దగ్గరకు, మట్టిపాత్రలు చేయడంలో మంచి నేర్పరి అయిన కుమ్మరివాడొకడు వచ్చి, "రాజుగారు నాకోసం కబురంపారు. రాణీగారికి ఒంట్లో బాగోలేదట. ఆమె సేవించే మందులు తయారు చేయడానికి, ప్రత్యేకమైనమట్టితో ఒక పాత్రచేయాలి," అన్నాడు.

"అదృష్టవంతుడివి! రాజదర్శనం మాటలా?" అన్నాడు క్యాంగ్‌యూ.

"అది నిజమే. కాని, అయన్ని దర్శించేందుకు కాస్త శుభ్రంగా వున్న దుస్తులతో వెళ్ళాలిగదా! ఇదుగో, ఈ సంచీలో మాసిన బట్టలు తెచ్చాను. వాటిని రేపు ఉదయానికల్లా బాగా ఉతికి ఇవ్వాలి," అన్నాడు.

ఆ మధ్యాహ్నం క్యాంగ్‌యూ వాటిని శుభ్రపరిచేందుకు వేడినీళ్ళలో ఉడకబెట్టేసరికి, నీలం రంగులో వున్న ఆ బట్టల రంగు వెలిసిపోయి తెల్లగా అయినై.

మర్నాడు కుమ్మరి వచ్చి, జరిగింది చూసి క్యాంగ్‌యూతో పోట్లాటకు దిగి, తనకు జరిగిన నష్టాన్ని గురించి రాజుకు ఫిర్యాదు చేస్తానంటూ, అతనికి డబ్బులివ్వకుండా వెళ్ళిపోయాడు.

కుమ్మరి రాజప్రాసాదంలోకి వెళ్ళేసరికి, రాజు, "ఆహా, ఏం తెలుపు! బట్టల్ని మల్లెపూవంత తెలుపుగా ఉతికినవాడెవడు?" అని కుమ్మరిని అడిగాడు.

వాడు రాజుతో, "ప్రభూ! మన నగరంలోనే క్యాంగ్‌యూ అనే బట్టలుతికేవాడున్నాడు. వాడు దేన్నయినాసరే, అఖరుకు

బర్మా జానపద కథ

ఎలుక తోలునైనా తెలుపు చేయగలడు. తమరు తెల్లఏనుగు కోసం ప్రయత్నిస్తు న్నారు గదా! గజశాలలో వున్న ఏ ఏనుగు నైనా వాడి కప్పగించండి. వాడు దాన్ని తెల్ల ఏనుగును చేయగలడు," అన్నాడు.

రాజు వెంటనే క్యాంగ్‌యూ కోసం భటులను పంపాడు. వాడు వచ్చి రాజు చెప్పింది విని, ఇది కుమ్మరి తనకు హాని చేసేందుకు వేసిన పథకం అని గ్రహించి, రాజుతో, "ప్రభూ! ఒక్క ఏనుగునేమిటి, తమరాజ్ఞాపిస్తే, గజశాలలో వున్న ఏనుగు లన్నిటినీ తళతళలాడే తెల్ల ఏనుగుల్ని చేయగలను. అయితే, అందుకు ముందుగా ఏనుగును బట్టల్ని ఉడకబెట్టినట్టుగా వేడి నీళ్ళలో ఉడకబెట్టాలి. అందుకవసరం అయిన తొట్టెను, ఇంతకుముందు తమ దర్శనానికి వచ్చిన కుమ్మరిచేత వేగిరం తయారు చేయించండి," అన్నాడు.

మరుక్షణం రాజు కుమ్మరిని రప్పించి, "ఒరే, రేపు సూర్యోదయానికల్లా, ఏనుగు నిలబడడానికి వీలైనంత పెద్ద తొట్టెనుచేసి తీసుకురా. అలా తేకపోయావేనిమ్ము రాజ్యం నుంచి బహిష్కరిస్తాను," అన్నాడు.

ఇది క్యాంగ్‌యూ పన్నినపన్నాగం అని తెలుసుకుని, చేసేదిలేక కుమ్మరి ఇంటికి పోయి, ఆ రాత్రంతా ఇంటిల్లపాదినీ మట్టిమోయడానికీ, అడుసుతొక్కడానికీ



సాయంగా తీసుకుని, తెల్లవారుతూండగా తొట్టెతో రాజుగారి వద్దకు వచ్చాడు.

క్యాంగ్‌యూ తొట్టెలో నీళ్ళు పోయించి, దానిచుట్టూ మంటలు పెట్టాడు. నీరు వేడెక్కుతూండగా మావటివాడు గజశాల నుంచి ఏనుగు నొకదాన్ని తోలుకువచ్చి, తొట్టెలోదింపాడు. దానితో తొట్టె ముక్కలూ చెక్కలుగా పగిలిపోయింది.

ఇది చూసి రాజు, కుమ్మరికేసి కళ్ళెర్ర చేసి, "ఒరే, నువ్వు చేపట్టిన వృత్తికే అవమానకరం! రేపు సూర్యోదయానికి రెండు ఘడియలముందుగా, గట్టిగా వుండే మరొక తొట్టెను చేసి తీసుకురాకపోయావో, నీ తల కొట్టేయిస్తాను," అన్నాడు.

''అలాగే, ప్రభూ!'' అంటూ కుమ్మరి బయలుదేరి, ఆ రాత్రికిరాత్రే రాజ్య సరిహద్దులు దాటి పారిపోయాడు.

ఇది విని రాజు కోపం పట్టలేక ఒర నుంచి కత్తిదూసి, క్వాంగ్ యూను, ''నువ్వూ, ద్రోహం తలపెట్టలేదు గదా?'' అని గద్దించాడు.

క్వాంగ్‌యూ రాజుకు వంగి, వంగి దణ్ణాలు పెట్టి, ''ప్రభూ! ఏనుగును, నా ఇంటికి పంపండి. రేపీపాటికి ఏనుగు నాదా లేక ఐరావతమా? అని తమరు భ్రమపడగలరు,'' అన్నాడు.

ఆ రాత్రి క్వాంగ్‌యూ తన ఇంటి వద్ద మావటివాడు వదిలిపోయిన నల్లఏనుగుకు, ఒక నిచ్చెన ఆనించి, దాని మీద నిలబడి, సున్నంతో గోడలకు వెల్లవేసినట్టు, దానికి ఆరగా ఆరగా ఐదారుసార్లు సున్నం నీళ్ళతో వెల్లవేశాడు.

తెల్లవారి రాజు, ఆ ఏనుగును చూసి పరమానందభరితుడై, ''ఆహాఁ, తెల్ల ఏనుగు కావాలన్న కోర్కె ఈనాటికి తీరింది!'' అని క్వాంగ్‌యూను మెచ్చుకుని, వాడికి లక్ష బంగారుకాసులూ, ఒక పంచకళ్యాణి గుర్రాన్నీ బహూకరించాడు.

క్వాంగ్‌యూ వాటితో ఇంటికి తిరిగి వస్తూనే, మూటాముల్లె సర్దుకుని గుర్రం మీద బయలుదేరి, సూర్యాస్తమయ మవుతూండగా రాజ్యసరిహద్దులు దాటి, ఒక చిన్న నదీప్రాంతాన్ని చేరాడు.

అక్కడ చిరిగిపోయిన బట్టలతో, ఒకడు నదిలో గాలం వేసి చేపలు పడుతూ కనిపించాడు. క్వాంగ్‌యూ వాడికేసి చూసి గుర్తించి, ''ఓహో, నన్ను సాధించబోయి కుమ్మరివి, జాలరివయ్యావన్నమాట!'' అన్నాడు.

కుమ్మరి, క్వాంగ్‌యూను చూసి తెల్లబోతూ, ''ఇక్కడి కెందుకొచ్చినట్టు? ఈ గుర్రమేమిటి?'' అని అడిగాడు.

అప్పుడు క్వాంగ్‌యూ, వాడికి జరిగినదంతా చెప్పి, ''పద, నది దాటి మరొక రాజ్యం చేరి, ఎవరివృత్తులు వాళ్ళం చేసుకుంటూ మిత్రుల్లా బతుకుదాం!'' అన్నాడు.






## 'సర్వాంతర్యామి!'

దోమకాటుకు ఎప్పుడో ఒకప్పుడు గురికానిమానవుడు భూప్రపంచంలో వుండే అవకాశంలేదు. ఎందుకంటే, దోమలు లేని చోటంటూలేదు. అవి ఎంతటి చలినైనా, వేడినైనా భరించగలవు. అతిశీతల ప్రదేశాలయిన ఉత్తరకెనడా, సైబీరియా దేశాలలోనూ, ఉత్తర ధృవ ప్రాంతంలోనూ ఉన్నాయి. వేడీ, వర్షాలూ నిండిన భూమధ్యరేఖ ప్రాంతపు అడవులలోనూ ఉన్నాయి. దోమలు కీటకాలన్నిటిలోకీ చాలా దృఢమైనవి!

## కీటక ప్రపంచం!

భూమిమీద రికార్డయిన 10,00,000 జీవరాశుల్లో 8,00 000 కీటక జాతికి చెందినవే. ఈ కీటకాలను గురించి రాయాలంటే కనీసం 6,000 పేజీల పుస్తకం కావలసి వుంటుంది. ఆ కీటకాల జాబితాను ఒక్కసారి చదివి పూర్తి చేసేలోగా మరి కొన్ని రకాల కీటకాలు పుట్టుకువచ్చే అవకాశం ఉన్నది!







## కోడిపిల్లల లెక్క!

గొంతెమ్మ కోరికలతో తొందరపడేవాళ్ళను గుడ్లు పొదుగుకింద ఉన్నప్పుడే కోడిపిల్లల్ని లెక్కించేవాళ్ళు, అని చెప్పడం కద్దు. ఒకవేళ అలా లెక్కగట్టగలిగామంటే అవి మన జనాభా అంత వుంటుందని ఓ అంచనా! సరే, గుడ్డు లోపల పరిపూర్ణంగా అభివృద్ధి చెందిన కోడి పిల్ల పైపెంకును పగలగొట్టుకుని బయట పడడానికి రెండు రోజులు పడుతుంది!

# అంతా  మా పిల్లలకే !























జీవిత భీమా — ఇది ప్రేమ చిహ్నం

లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా

AMRITA BHARATI

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1992 మార్చి నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



Devidas Kasbekar

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ జనవరి నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/-లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: — చందమామ ఫొటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### నవంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: ఎగుడు దిగుడు తతంగం!

రెండవ ఫోటో: ఎగిరేనా పతంగం?

పంపినవారు: పొన్నపల్లి సరస్వతి, C/o. పి. శ్రీ రామారావు,
మాలికిపురం-533 253 (ఆం. ప్ర)

బహుమతి మొత్తం రు. 50/- నెలాఖరులోగా పంపబడుతుంది.


చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 48-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026



Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.



1966

26వ సంవత్సరంలో
మీ అభిమాన పత్రిక!

**విజయచిత్ర**

26 సంవత్సరాలుగా సినీ పరిశ్రమకీ-
సినిమా అభిమానులకీ మధ్య వారధిగా
వుంటూ, వన్నెతరగని నాణ్యతతో
వెలువడుతున్న
ఏకైక సినిమా పత్రిక

**విజయచిత్ర**

1992




నాటినుండి నేటివరకు సినిమా అభిమానుల
ప్రియతమ పత్రిక!

**విజయచిత్ర**

ఇది ఒక డాల్టన్ ప్రచురణ

దూరతీరాలలో ఉన్న మీ బంధుమిత్రులకు
మీరు ఇవ్వదగిన ప్రియాతి ప్రియమైన కానుక

# చందమామ



వారికి కావలసిన భాషలో చందమామను అందజేయండి:

అస్సామీ, బెంగాలీ, ఇంగ్లీష్, గుజరాతీ, హిందీ, కన్నడం, మలయాళం,
మరాఠీ, ఒరియా, సంస్కృతం, తమిళం, తెలుగు.

దూరదేశంలో ఉన్నప్పటికీ వారికి మాతృదేశంలో ఉన్న మధురానుభూతిని కలిగించండి।

సంవత్సర చందా:

ఆస్ట్రేలియా, జపాన్, మలేషియా & శ్రీలంక

సీ మెయిల్ ద్వారా: రూ. 105.00 ఎయిర్ మెయిల్ ద్వారా: రూ. 216.00

ఫ్రాన్స్, సింగపూర్, ఇంగ్లండు, అమెరికా,
పశ్చిమజర్మనీ & ఇతర దేశాలు

సీ మెయిల్ ద్వారా: రూ. 111.00 ఎయిర్ మెయిల్ ద్వారా: 216.00

మీ చందాలను 'చందమామ పబ్లికేషన్స్' పేరు మీదుగా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గాని, మనిఆర్డర్ ద్వారా గాని కింది చిరునామాకు పంపండి:

సర్క్యులేషన్ మేనేజర్, చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600026

